# ఆత్మబోధ

(శ్రీ మదాద్య శంకరాచార్య విరచితం)



నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# గ్రంథకర్త పరిచయం

ప్రఖ్యాత రచయిత, విమర్శకులు, వక్త, ఉపాధ్యాయులు అగు శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషలలో పండితులు. స్వయంకృషితో తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషలలో అనేక పట్టములు సంపాదించారు. 1943-48 సంవత్సరాలలో గాంధీ గారి నిర్మాణ కార్యక్రమములో చురుకుగా పాల్గని ఖద్దరు, హిందీ భాషా ప్రచారము చేశారు. తరువాత కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరి 1977 లో ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. ఆ కాలములో వారు రచించిన గ్రంథాలలో శుభోదయము, తుక్కాంబ, రఘునాధ విలాసము, 'పూర్వాంధ్ర, కవులు' ఆంధ్ర, ఉస్మానియా, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. ఉద్యోగవిరమన తరువాత వేద వాఙ్మయముపై అపారకృషి చేసి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పాతంజల యోగ సూత్రముల వంటి విషయములపై సరళమైన తెలుగు భాషలో అనేక గ్రంథములు రచించిన సోమయాజులుగారు స్వతంత్ర భావనాశక్తి గల పండితులు 13-12-1922 తేదీన కృష్ణాజిల్లా తోట్టవల్లూరు గ్రామంలో జన్మించిన వీరు 2-2-1997 న తాడిగడప గ్రామంలో వారి స్వగృహమున దివంగతులైనారు.

# ప్రవేశిక

శ్రీ జగద్గురులైన శ్రీ ఆదిశంకరులు రచించిన ప్రకరణ గ్రంథాలలో ఈ ఆత్మబోధ అనేది ఒకటి. ఒక ప్రత్యేకమైన వేదాంత విషయాన్ని (ప్రకరణాన్ని) గూర్చి చర్చించి వివరించే గ్రంథాన్ని ప్రకరణ గ్రంథం అంటార. ఈ గ్రంథంలో ఆత్మను గూర్చి, ఆత్మజ్ఞానాన్ని గూర్చి ప్రధానంగా వివరించారు. చక్కటి కవిత్వశైలిలో, విషయం సుబోధంకంగా ఉండేటట్లుగా, ఉపమానాలు, దృష్టాంతాలు మొదలైన అలంకారాలతో మనోహరంగా విషయాన్ని వర్ణించారు. ఈ ప్రకరణ గ్రంథాల ప్రధానోద్దేశ్యం ఏమిటంటే,– అద్వైతమత మూలసిద్ధాంతాలను సాధారణ ప్రజలకు– పాఠకులకు అందించటం. ఈ ఉద్దేశ్యంతోనే ఆదిశంకరులు అనేక ప్రకరణ గ్రంథాలను రచించారు. వీటి ప్రయోజనాన్ని, ప్రాశస్త్యాన్ని గుర్తించి తరువాతివారు కూడా కొన్ని గ్రంథాలను రచించి కర్తృత్వాన్ని శంకరుల కాపాదించారని కొందరు విమర్శకులంటారు. అపరోక్షానుభూతి, ఆత్మబోధ, వివేకచూడామణి లాంటి కొన్ని గ్రంథాల విషయంలో కర్తృత్వం నిర్విహదంగానే ఉంది. ఈ ఆత్మబోధ అనే గ్రంథంలో 68 శ్లోకాల్లో ఆత్మ యొక్క స్వరూపాన్ని విశదంగా వర్ణించారు. అనేక ఉదాహరణలు ఇచ్చి ఆత్మ అనేది శరీరంకంటె, మనస్సుకంటె, ఇంద్రియాలకంటె భిన్నమైనది అని నిరూపించారు. ఇందులోని విషయం ఆత్మజ్ఞానానికి సంబంధించినది కాబట్టి ఈ ప్రవేశికలో శ్రీ జగద్గురువులను గూర్చి వారు ప్రతిపాదించిన అద్వైత వేదాంతాన్ని గురించి వివరించిటం అప్రస్తుతం కాదని భావించాను.

శ్రీ జగద్గురు ప్రశంస: శ్రీ ఆదిశంకరుల జీవిత చరిత్రను అధ్యయనం చేసిన వారికి ఆయనలో ఒక గొప్ప వ్యక్తిత్వము, అసామాన్యమైన పాండిత్యము, ఉదాత్తమైన నడవడి, సాటిలేని కావ్యరచనా ప్రతిభ, తిరుగులేని విమర్శనాపాటవం గోచరిస్తాయి. ఇటువంటి ఆదర్శగుణాలన్నీ ఒకే వ్యక్తిలో కనిపించటం అరుదు. గురువుల యెడల,

తల్లి యెడల అనన్యమైన భక్తి, శిష్యులమీద అపారమైన వాత్సల్యం, భక్తులమీద అంతులేని దయ, విపక్షుల యెడల అనంతమైన క్షమ ఉండటం ఆయనలో చూస్తాము.

ఆయన, మాయావాదానికి వ్యవస్థాపకుడు కాబట్టి– ఈ ప్రపంచం మిథ్య అని చెప్పాడు కాబట్టి, కర్మభూమియైన ఈ భారతదేశంలో, భారతీయుల సాంఘిక రాజకీయ జీవితంలో, ఒక విధమైన అకర్మణ్యత, సోమరితనం, నిర్లిప్తత, వ్యాపించాయని విమర్శించేవారు కూడా ఉన్నారు. వారి అభిప్రాయం, సత్యాన్ని వ్యక్తం చేసినందువల్ల సంఘానికి, వ్యక్తికి తాత్కాలికమైన కష్టం, నష్టం కలుగుతుంది కాబట్టి అసత్యాన్ని, లేదా అర్థసత్యాన్ని ప్రచారం చేయమన్నట్లుగా ఉంటుంది. శంకరులు జగత్తుయొక్క స్వరూప స్వభావాలు చెప్పారేగాని, అకర్మణ్యతను, నిర్లిప్తత బోధించలేదు. నిజానికి ఆయనవంటి దేశభక్తుడు, సంఘసంస్కర్త ఇంకొకరు లేరు. ఆయన కన్యాకకుమారి నుండి బదరీనాథ్ దాకా, పూర్వసముద్రం నుంచి పశ్చిమసముద్రం దాకా ఆదర్శంగా ఉండటం, సాంఘిక జీవనంలో సన్యాసులకు స్థానం కల్పించటం, మతాలను స్థాపించటం, ఇవన్నీ ఆయన ప్రపంచాన్ని ఉపేక్షించలేదు అనేందుకు నిదర్శనాలు. ఈనాటికీ విపత్సమయాల్లో సన్యాసులు సంఘసేవకులవటం మనం చూస్తూనే ఉన్నాం. ఆయన చేసినదల్లా, అవైదికమైనటువంటి, అర్థవైదికమైనటువంటి, వైదికమతంలాగా కనిపిస్తూ ప్రజలను మోసగిస్తూ హింసిస్తూ ఉండే దుష్ట సంప్రదాయాలను సంఘంనుండి దూరంచేసి వైదిక మతాన్ని తిరిగి ప్రతిష్ఠించి, ప్రచారం చేశారు. ఏ మతంలో, ఎక్కడ ఏ విధమైన వేదవిహతమైనట్టి మంచి సిద్ధాంతాలున్నా వాటిని ఆయన నిరసించకుండా శ్లాఘించారు. గ్రుడ్డిగా ఇతర మతాలను దూషించలేదు. తప్పుత్రోవన పోతున్న హిందూసంఘాన్ని మళ్ళీ సరియైన త్రోవకు మళ్ళించారు. అన్యమతస్థులకు మన మతంలో నెరసులు వెతికే అవకాశం లేకుండా చేశారు. ఇందుకై ఆయన ఎన్నుకున్న సాధనాలు. 1) అవైదికమైన మతాలవారు చేసే ఆగడాలను సాత్త్విక పద్ధతిలో అరికట్టటం, 2) వైదిక గ్రంథాలైన ఉపనిషత్తులు మొదలైన వాటికి తమ భాష్యాలు, వ్యాఖ్యానాల ద్వారా సరియైన అర్థాలను నిర్వచించి వాటిని పండిత పామరులకు అందుబాటులోనికి తీసికొని రావటం, 3) పరివ్రాజక సంఘాలను స్థాపించి ఆ సంఘాలద్వారా సాంఘిక జీవనంలో సన్యాసాశ్రమానికి స్థానాన్ని కల్పించటం, 4) మతాలు స్థాపించి, వాటి ఆధిపత్యంలో హిందూ ధర్మప్రచారము, పరిరక్షణము చేయటానికి అవకాశం కల్పించటం,5) వేద మతప్రచారానికి

కాంతాసమ్మితంగా ఉండే కవిత్వాన్ని సాధనంగా చేసుకొని ప్రకరణ గ్రంథాలు, స్తోత్రాలు, తంత్ర గ్రంథాలను రచించి, ప్రవచించటం,

6) ఏ మతంతోను గ్రుడ్డిగా విరోధం పెట్టుకోకుండా, ఆ మతం మన వేదమతానికి అనుకూలంగా పోయినంతదూరం దానిని సమర్థిస్తూ అక్కడినుండి తప్పుమార్గాన పోకుండా దానికి సరియైన మార్గం చూపటం, ఇవన్నీ హైందవమత పునరుద్ధరణకు ఆయన ఎన్నుకున్న మార్గాలు. శివుడు, విష్ణువు, శక్తి, గణపతి మొదలైన దేవతలందరిలోను ఆయన అభేదాన్నే చూచారు. అందరు దేవతలకు సంబంధించిన స్తోత్రాలు రచించారు. అన్ని క్షేత్రాలు దర్శించారు. ఆయా క్షేత్రాల్లో ఉంటూ (శ్రీశైలంలో లాగా) ఆగడాలు ఆర్భాటాలూ చేస్తూ ప్రజలను భయపెట్టి ఆకర్షించే దుష్ట సంప్రదాయాలను రూపుమాపారు. జ్ఞానమార్గం సర్వోత్కృష్టమైనదని చెప్పారే తప్ప కర్మ, భక్తి, ఉపాసనామార్గాలను ఆయన తిరస్కరించలేదు – నిరసించలేదు, ప్రోత్సహించారు. అర్హతను బట్టి ఆయా మార్గాలను నిర్ణయించుకొనే స్వేచ్ఛను సాధకులకే వదలారు. ఇంతటి విశాలదృష్టి, విశాల హృదయం కలవాడు కాబట్టే జగద్గురువులైనారు. ఆయన ఇతర మతాలను ఖండించారని ఆయనమీది భక్తితో, అభిమానంతో ఆయన శిష్యులెవరైనా అన్నప్పటికి నిజానికి ఆయన ఏ మతాన్నీ ఖండించలేదు. సత్యాన్ని చూపటం వల్ల అసత్యం దానంతట అదే అంతర్ధానమైంది. దీపం రాగానే చీకటి దానంతట అదే మాయమైపోతుంది. దీపం చీకటిని ఖండించటంలేదు. ఖండించినట్లు కనిపిస్తున్నది. అంతే! దేనిధర్మం దానిది. అట్లాగే ఆయన చూపిన సత్యంవల్ల–అద్వైతంవల్ల ఇతర మతాల వాటంతట అవే పరాస్తమైపోతాయే తప్ప ఆయనకు వాటి యెడల ద్వేషంగాని, క్రౌర్యంగాని, కార్పణ్యంగాని ఏమీ లేవు – దీపానికి చీకటిమీద క్రౌర్యం లేనట్లు! ఇది నూటికి నూరుపాళ్ళూ నిజం. హిందువైన ప్రతివాడూ గమనించాల్సిన విషయం. ఆయన నిత్యనైమిత్తిక కర్మలను నిష్కామకర్మలను, భక్తియోగాన్ని, ఉపాసనను– సాత్విక, తాంత్రిక ఉపాసనను కూడా అంగీకరించారు. ఆయన ఎంతటి ఆదర్శవాదియో అంతటి యధార్థివాది– కార్యవాది. జగత్తు యొక్క వ్యవహారిక సత్తను ప్రతిపాదించిన ఆ మహనీయుడు గాలిలో మేడలు కట్టినవాడు కాదు. అద్వైత వేదాంతాన్ని వ్యావహారిక ధర్మంగా వ్యాప్తం చేసిన జగద్గురువు ఆయన. ఈ సత్యాన్ని అంతా ఒప్పుకోవాల్సిందే!

రామాయణమంతా కట్టె, కొట్టె, తెచ్చె అనే మూడు మాటల్లో చెప్పినట్లుగా ఆయన జీవితాన్ని ఈ క్రింది శ్లోకంలో చూపించారు-

*అష్టవర్షే చతుర్వేదీ ద్వాదశే సర్వశాస్త్రవిత్।*
*షోడశే కృతవాన్భాష్యం ద్వాత్రిం శే మునిరభ్యగాత్॥*

అని.

ఆయన జీవించినది ముప్పది రెండు సంవత్సరాలే! ఆయన సాధించినది చూస్తే ఆ అలౌకిక శక్తికి ఆశ్చర్యచకితులం కాక తప్పదు. ఎనిమిదేండ్ల ప్రాయంలో నాల్గువేదాలు అభ్యసించటం, పన్నెండు సంవత్సరాల వయసులో సమస్తశాస్త్రాలు ఆపోశన పట్టటం, పదహారవ యేట భాష్య రచనకుపక్రమించటం నిజంగా అలౌకికం కాదా? మానవశక్తికి సాధ్యమేనా? అటువంటి మహనీయుని జీవితాన్ని ఏ విధంగా వర్ణించి చెప్పగలం?

**అద్వైతం:** అద్వైత మతమనేది శంకరులు క్రొత్తగా కనిపెట్టినది కాదు. అది అత్యంత ప్రాచీనకాలం నుండి ఈ నెలమీద పుట్టి, ఉంటూ ఉన్నదే! ఉపనిషత్తులన్నీ అద్వైతపరమైన అర్థాన్ని చెపుతున్నవే! ఈ అద్వైత మతాన్ని శ్రీ శంకరులకు పరుమగురువైన శ్రీ గౌడపాదుల వారు తమ మాండూక్య కారికల్లో ప్రతిపాదించారు. దానినే శంకరులు తమ భాష్యాల్లో విశదీకరించారు. వీరి భాష్య రచనలో ఒక విశిష్టత ఉన్నది. సామాన్యులకు సైతం సుబోధకంగా ఉండటంతో బాటు, పండితులైనవారికి ఇంకా గహనము, గంభీరము అయిన విషయాలు గోచరిస్తాయి. వీరు తమ ప్రస్థానత్రయ భాష్యంలో అద్వైతమతాన్ని ప్రతిపాదించారు, వేదాంతంలో ఇంకా అనేకమైన మతాలున్నాయి. వాటిలో కొన్ని శంకరులకంటె పూర్వమే ప్రచారంలో వున్నా, వాటి విశేష ప్రచారం మాత్రం శంకరుల తరువాతనే ప్రారంభమైనదని చెప్పవచ్చు. వీటిలో శ్రీరామానుజుల విశిష్టాద్వైతం, శ్రీ మధ్వాచార్యులవారి ద్వైతమతం, నింబార్కుని ద్వైతా ద్వైతం, వల్లభాచార్యుని శుద్ధాద్వైతం మొదలైనవి. శ్రీ శంకరులకు పూర్వం చాలామంది మతాచార్యులు భాష్యాలు, వ్యాఖ్యలు వ్రాశారు గాని శంకర భాష్యావతరనంలో చాలాభాగం అవన్నీ కనుమరుగైపోయాయి.

అద్వైతమతానికి మూలమంత్రం ఈ శ్లోకం-

*"బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నా పరః"*

ఈ శ్లోక పాదంలో నాలుగు ప్రధానాంశాలున్నాయి. 1) బ్రహ్మసత్యం 2) జగత్తు అనేది మిథ్య 3) జీవుడే బ్రహ్మ 4) జీవుడు బ్రహ్మకంటె ఏ విధంగానూ భిన్నుడు కాడు: అని.

'పరమార్థసత్త'యైన బ్రహ్మ ఒకడే అని, అనేకాత్మకంగా కనిపించే ఈ జగత్తు మాయ' అనే విషయం అద్వైత వేదాంతానికి మూల మంత్రం అనుకోవచ్చు. ఈ సత్యాన్ని హృదయంగమం చేసుకోవాలంటే కొన్ని మూలసిద్ధాంతాల్ని తెలుసుకోవలసి ఉంటుంది. ఈ అద్వైత సిద్ధాంతానికి ఒక ప్రధాన తత్త్వం – 'ఆత్మ ప్రత్యమనేది స్వయం సిద్ధమైనది' అనేది ఒకటి. జగత్తు అనేది అనుభూతి మీద ఆధారపడి ఉన్నది. అనుభవం ఆధారంగానే ఈ జగత్తులోని సమస్త వ్యవహారాలూ నడుస్తున్నాయి. ఈ అనుభూతి యొక్క మూలంలో ఆత్మయొక్క సత్త స్వతఃసిద్ధంగా ఉంటోంది. ఈ విషయాన్ని జగద్గురువులు చక్కగా విశదీకరించారు– "ఆత్మ అనేది ప్రమాణం మొదలైన సమస్త వ్యవహారాలకు ఆశ్రయం. కాబట్టి, ఈ వ్యవహారాలన్నింటికి ముందే ఆత్మ అనేది ఉంది. ఆత్మను మనం నిరాకరించలేము–లేదని, కాదని, అనలేము. నిరాకరణ మనేది ఎప్పుడూ బయటి నుండి వచ్చిన వస్తువుల విషయంలో జరుగుతుంది. అంతేగాని స్వభావాన్ని నిరాకరించలేరు. అగ్ని, ఉష్ణత్వాన్ని అగ్నిచేత నిరాకరించదు – వేడి అనేది అగ్నియొక్క స్వభావం కాబట్టి! ఉష్ణత్వం అగ్నిచేత ఎన్నడూ నిరాకరింపబడదు. తెలుసుకోదగిన దానిలో (జ్ఞాతవ్య వస్తువులో) మార్పు అనేది ఉండవచ్చు గాని, జ్ఞాతలో (తెలుసుకొనే వానిలో) అన్యధాభావం( మార్పు) ఉండదు" అని.

అట్లాగే, "నేను వర్తమానాన్ని ఇప్పుడు తెలుసుకుంటున్నాను. జరిగిపోయిన దానిని నేను తెలుసుకున్నాను. జరగబోయేదానిని నేను తెలుసుకుంటాను" అనే ఈ విధామైన అనుభవ పరంపరలో జ్ఞాతవ్యమైన వస్తువులోనే మార్పు కనిపిస్తోంది గాని జ్ఞానస్వరూపం గల జ్ఞాతలో (నేనులో) మార్పు లేదు. ఎందుచేత? జ్ఞాత ఎల్లప్పుడు తన రూపంలో (స్వప్న రూపంలో) ఉండనే ఉంటాడు కాబట్టి! ఇదే 'స్వస్వరూపంలో స్వయం సిద్ధత' అంటే. ఈ విషయాన్నే జగద్గురువులు ఈ విధంగా అన్నారు– 'ప్రతివానికి ఆత్మ యొక్క అస్తిత్వంలో (ఉన్నదనే విషయంలో) నమ్మకం ఉంది. ఎందుచేతనంటే 'నేను లేను' అనుకొని, తాను లేకపోవటాన్ని ఎవడూ విశ్వసించడు. (పిచ్చివాడు కూడా తాను లేనని అనుకోడు)

ఆత్మ అనేది లేదని అనుకున్నప్పుడే తాను లేకపోవటాన్ని కూడా నమ్ముతాడు. తాను ఉన్నట్లు నమ్ముతున్నాడు కాబట్టి ఆత్మను విశ్వసిస్తున్నట్లే !

కాబట్టి, ఆత్మ అనేది స్వయంసిద్ధమైనది. ఆత్మ విషయంలో అనుమానానికి తావు లేదు. ఇది ఉపనిషత్తుల్లో చెప్పిన సత్యమే ! అందుకే బృహదారణ్యకంలో యాజ్ఞవల్క్యుడు ఈ విధంగా అన్నాడు– " అన్నిటిని తెలుసుకొనే వానిని మనం ఏ విధంగా తెలుసుకోగలుగుతాము? సూర్యని ప్రకాశంవల్ల జగత్తు ప్రకాశితమౌతోంది గదా! అటువంటి సూర్యుణ్ణి మనం ఏ విధంగా ప్రకాశింపజేయగలం?" అని (2–2–14) కాబట్టి ప్రమాణాలన్నింటికి కారణభూతమైన ఆత్మను ఏ ప్రమాణంలో రుజువు చేయగలం? ఆ ఆత్మ సత్త స్వయంసిద్ధమైనది.

మరొక విషయం– " ఆత్మ అనేది జ్ఞానస్వరూపం కలది" అని. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని తైత్తిరీయంలో అన్నారు. ఆత్మ అనేది జ్ఞానము, జ్ఞాత కూడాను, వాస్తవానికి జ్ఞాత (తెలుసుకొనేవాడు) జ్ఞానంకంటె వేరుకాదు. జ్ఞాత, జ్ఞాపం అనేవి భిన్నమైనట్టి వస్తువులు కావు. జ్ఞేయపదార్థం పుట్టటంతోనే జ్ఞానమనేది జ్ఞాతరూపంలో ప్రకటమవుతుంది, జ్ఞేయం అనేది (తెలుసుకోదగినది) లేనప్పుడు జ్ఞాత అనేవాడు ఉండనే ఉండడు. ఈ జగత్తు జ్ఞేయరూపంలో వ్యక్తం కాగానే ఆత్మ అనేది జ్ఞాత రూపంలో వ్యక్తం అవుతోంది. అయితే, జ్ఞేయమైనట్టి ఈ జగత్తు లేనప్పుడు కూడా అది (ఆత్మ) ఉండనే ఉంటోంది. ఒకే జ్ఞానం (ఆత్మ) కర్తతోను, కర్మతోను కూడా సంబంధాన్ని పొంది భిన్నంగాతోస్తుంది. వాస్తవానికి రెండూ (కర్త, కర్మ) ఒకటే! నిత్యమైనట్టి ఆత్మ, జ్ఞానం స్వరూపం కలది అనటంలో అనుమానం అక్కరలేదు. ఎందుచేతనంటే జ్ఞానం కూడా నిత్యజ్ఞానము, అనిత్యజ్ఞానము అని రెండు విధాలుగా ఉంటుంది. అనిత్య జ్ఞానమనేది విషయం యొక్క సాన్నిధ్యం వల్ల పుట్టే ఒక విధమైన చిత్తవృత్తి మాత్రమే! విషయ సాన్నిధ్యం లేనప్పుడు అది (అనిత్యజ్ఞానం) కనపడకుండాపోతుంది. రెండవదైనట్టి నిత్యజ్ఞానం అనేదే శుద్ధమైన జ్ఞానం. ఇది అనిత్యజ్ఞానం కంటె భిన్నమైనది. ఇది (నిత్యజ్ఞానం) ఎల్లవేళలందు పూర్తిగా ఉండేది. ఎట్లాగంటే, దృష్టిని ఉదాహరణగా తీసుకుంటే, ఈ దృష్టిజ్ఞానం రెండు రకాలుగా ఉంటుంది. మొదటిది నేత్రదృష్టి, ఇది అనిత్యదృష్టి తిమిర రోగం లేదా రేచీకటి వచ్చినపుడు పోతోంది. ఆ రోగం తగ్గగానే మళ్ళీ వస్తోంది. కాని ఆత్మ దృష్టి (నిత్యజ్ఞానం) అనేది

నిత్యమైనది. అందుచేతనే శ్రుతి ఆత్మనే దృష్టికి కర్తగా పేర్కొన్నది. ఎందుచేతనంటే ఆత్మదృష్టి నిత్యమైనది అనేందుకు ప్రమాణం ఉంది– గ్రుడ్డివాడు కూడా (నేత్రదృష్టి లేనివాడు) స్వప్నంలో తనవాళ్ళని, తన ప్రియుల్ని చూచానని చెపుతున్నాడు. కాబట్టి ఆత్మదృష్టి– ఆత్మజ్ఞానం నిత్యమైంది. నిత్యమైనట్టి ఆత్మ, జ్ఞాన స్వరూపం కలది అనే విషయంలో సందేహం అక్కరలేదు.

ప్రతి అనుభవంలోనూ మనకు రెండు విషయాలు కనిపిస్తున్నాయి. అనుభవించే ఆత్మ, అనుభవానికి విషయమైనట్టి బాహ్యవస్తువు. అంటే, జీవుడు– జగత్తు అన్నమాట. ఈ జీవుడు, జగత్తు అనేవి రెండూ వేరు వేరు స్వతంత్ర సత్తలుగా –ఆస్తిత్వాలుగా కనిపిస్తాయి. కాని, సూక్ష్మ దృష్టితో చూస్తే ఆత్మసత్త ఒక్కటే ఉన్నదని తేలుతుంది. జగత్తు యొక్క సత్తను కేవలం లోక వ్యవహారంకోసం అంగీకరిస్తారు. కాబట్టి, ఈ జగత్తు అనేది పరమార్థ రూపంలో సత్యం కాదు. వ్యవహార రూపంలో మాత్రమే సత్యం. ఈ జగత్తు యొక్క వ్యావహారికతను గురించి చెప్పే సందర్భంలో ఇట్లా అన్నారు– "జ్ఞానమనేది ఆత్మయొక్క స్వరూపం. అది నిత్యమైనది. చక్షురాది ఇంద్రియమార్గాల ద్వారా పరిణతి చెందే బుద్ధియే రూపం, రసం మొదలైన వాటిని గ్రహిస్తోంది. ఈ రూపం, రసం మొదలైన ప్రతీతులన్నీ ఆత్మవిజ్ఞానానికి విషయాలుగా పుడుతున్నాయి. కాబట్టి, ఆత్మజ్ఞానం ద్వారా వ్యాప్తి చెంది, ఉత్పన్నం కాని వస్తువంటూ ఏదీ ఈ సృష్టిలో లేదు. ఈ జగత్తులో ఉన్న పదార్థాలన్నీ నామరూపాలతో కూడినవే! అవి వాటిలో ఉండే కారణశక్తితో పాటే మార్పుచెందుతూ ఉంటాయి. నామరూపాలలో ఏ ఏ అవస్థలలో, ఏఏ వికృతులు (మార్పులు) జరిగినా, ఆ అవి అవస్థలలోనూ, ఆయా మార్పులు (వికృతులు) ఆత్మశక్తిని విడిచి ఉండవు. దీనికి కారణం ఏమిటంటే – కార్యశక్తులలో కారణశక్తి(సత్త) ఎల్లప్పుడు అన్ని విధాలా అనుస్యూతంగా ఉంటూనే ఉండటం! జగత్తులోని కార్యకారణాలకున్న నియమం ఇదే! కుండ (ఘటం) కార్యం గదా! ఆ కార్యానికి మట్టి అనేది కారణం! ఆ కుండ, తనకు కారణమైనట్టి మట్టి లేకుండా ఒక్క క్షణం కూడా ఉండలేదు గదా! అట్లాగే, వస్త్రం అనేది కార్యం. దానికి నూలు (దారం) అనేది కారణం. తనకు కారణమైన నూలు పోగులు లేకుండా వస్త్రం అనేది ఉండలేదు– దానికి అస్తిత్వమే ఉండదు. కాబట్టి ఈ జగత్తులోని పదార్థాలన్నీ కార్యాలు. వాటి అన్నింటికి ఏకైక కారణం బ్రహ్మ (ఆత్మ) ఆ కార్యాలు తమకు కారణమైనట్టి బ్రహ్మను వీడి క్షణం కూడా ఉండలేవు. కాబట్టి ఈ

సృష్టిలో దేశకాలాదులచే విభక్తమైనట్టి భూత భవిష్యద్వర్తమానాలలో ఉండే ఏ వస్తువైనా సరే ఆత్మలేకుండా విడిగా ఉండలేదు. సృష్టిలో వేరువేరుగా నామరూపాలు కనిపిస్తున్నా వాటిలో చైతన్య రూపంలో ఒకే ఆత్మ ప్రకాశం కనిపిస్తోంది. అట్లాగే ప్రతి అనుభవంలోనూ ఆత్మోపలబ్ధి కలుగుతోంది. ఆ ఆత్మయే విషయ రూపంలోనూ, విషయి రూపంలోను కూడా ఉంటోంది. – అనుభవకర్తరూపంలోను అనుభవానికి కర్మరూపంలోనూ కూడా ఉంటోది. అదే లోపలా, బయటా కూడా ఉంటోంది. అదే (ఆ ఆత్మయే) కర్తగాను, కర్మగానూ కూడా ఉంటోంది. ఈ జగత్తులో సర్వత్రము, నిర్వికారము అయిన ఆ ఆత్మసత్తయే అఖండంగా వ్యాప్తమై ఉంది. అదే, మనకు వివిధ రూపాల్లో కనిపిస్తోంది. 'కుండ' అని మనం అనే వస్తువు ఆ అఖండసత్త యొక్క ఒక ఉన్మేషం మాత్రమే! అది (ఘటం) స్వతంత్రమైనట్టి వస్తువు కానే కాదు. ఇదే అద్వైత వేదాంత రహస్యం. జగత్తుకు ఈ విధంగా ఇంత ప్రాధాన్యత నిచ్చిన అద్వైతం నేలవిడిచిన సాము ఎట్లా అవుతుంది?

**సత్త:** జగత్తు విషయంలోను, బ్రహ్మ(ఆత్మ) విషయంలోను 'సత్త' అనే పదాన్ని వాడుతూ ఉంటారు. వేదాంతంలో మూడు రకాలైన సత్తను అంగీకరిస్తారు. 1)ప్రాతిభాసిక సత్త 2) వ్యావహారిక సత్త 3)పారమార్థిక సత్త; అని.

**1) ప్రాతిభాసిక సత్త** అంటే– ప్రతీతి సమయంలో –మనకు గోచరించిన సమయంలో సత్యంగా కనిపించి. తరువాత అది సత్యంకాదు, అని తెలుస్తుంది. మసక చీకటిలో త్రాడును చూచి, పాముగా భావించటం, తరువాత యధార్థాన్ని గుర్తించటం. అంటే మనకు గోచరించినపుడు మాత్రం సత్యంగా కనిపించింది. తరువాత అసత్యమని తేలిపోయింది.

**2) వ్యావహారిక సత్త:** ఇది జగత్తులోని సమస్త వ్యవహారాల్లో, గోచరమయ్యే పదార్థాల్లోనూ ఉంటుంది. ఈ జగత్తులోని ఈ పదార్థాలకు 5 ధర్మాలుంటాయి 1) అస్తి (అవి ప్రపంచంలో ఉండటం) 2) భాతి (అవి ప్రకాశిస్తాయి) 3) ప్రియము (అవి ఆనందాన్ని కలిగిస్తాయి) 4) రూపం (అవి ఏదో ఒక ఆకారాన్ని కలిగి ఉంటాయి). 5) నామం (వాటికి ఏదో ఒక పేరు ఉంటుంది) ఈ ఆస్తి, భాతి, ప్రియం, రూపం, నామం అనే అయిదు ధర్మాలలో మొదటి మూడు (ఆస్తి, భాతి, ప్రియం) బ్రహ్మస్వరూపాలు. చివరి రెండూ (నామం, రూపం) జగత్తు యొక్క స్వరూపాలు. దీనినిబట్టి ఆ పరబ్రహ్మము

ఈ జగత్తులోని పదార్థాలన్నింటిలోను కలసిపోయి, వాటిలో లీనమై ఉంటుంది. ఆత్మ సాక్షాత్కారం కాగానే నామరూపాలకు సంబంధించిన అనుభవం పోతుంది. కాబట్టి ఈ జగత్తు ఏకాంకసత్త కాదు. వ్యవహార కాలంలో మాత్రం సత్యంగా కనిపిస్తుంది. కాబట్టి, ఈవిధమైన వికారాలు కలిగిన పదార్థాలన్నీ వ్యావహారిక సత్తకు సంబంధించినవి.

**పారమార్థిక సత్త:** ఈ పైన చెప్పిన వ్యావహారిక వస్తువులన్నింటి కంటె భిన్నమైనట్టిది, మూడు కాలాల్లోనూ అవిచ్ఛిన్నంగా ఉండేదీ అయిన సత్యం ఉంది. అదే బ్రహ్మము. ఈ బ్రహ్మము యొక్క సత్తనే పారమార్థిక సత్త అంటారు. ఈ మూడింటికి చెందనివి ఏమైనా ఉంటే (అసలు ఉండనే ఉండవు) అవి అసత్యమైనవి – వంధ్యాపుత్రుని వలె (గొడ్రాలి బిడ్డవలె) ఆకాశ కుసుమంలాగా ఇవన్నీ తుచ్ఛమైనవి. ఇవి సత్తావిహీనమైనవిగా చెప్పుకోవచ్చు.

**బ్రహ్మ:** ఈ విధమైన నిర్వికల్పన, నిరుపాధిక, నిర్వికార సత్తను బ్రహ్మమంటారు. ఉపనిషత్తుల్లో ఇటువంటి నిర్గుణ బ్రహ్మ మాత్రమే ప్రతిపాద్య విషయమని శ్రీ శంకరుల అభిప్రాయం. ఎందుచేత? నిర్గుణబ్రహ్మ మాత్రమే పారమార్థిక సత్త కాబట్టి! సగుణ బ్రహ్మమనేది జగత్తులాగానే మాయతో కూడినది. శంకరులు బ్రహ్మ యొక్క స్వరూప నిర్ణయంకోసం రెండు రకాల లక్షణాలను గ్రహించారు. 1) స్వరూప లక్షణం 2) తటస్థ లక్షణం – అని. స్వరూప లక్షణమనేది సత్యము, తాత్త్వికము అయిన రూపాన్ని చెపుతుంది. తటస్థలక్షణం అనేది ఒకానొక కాలంలో ఉండే, ఆగంతుక – వచ్చిపోయే గుణాల్ని చూపిస్తుంది. ఉదాహరణకు: ఒక బ్రాహ్మణుడు నాటకంలో క్షత్రియవేషం (రాజు వేషం) వేస్తాడు. రంగస్థలంమీద తాను రాజుగానే వ్యవహరిస్తాడు. క్షత్రియ గుణాలన్నీ ప్రదర్శిస్తాడు. మరి అతడు రాజు కాడా? రాజే! ఎంతవరకు? నాటక ప్రదర్శన జరిగినంతవరకు! తరువాత? అతడు తనదైన విశుద్ధమైన నిజరూపంలోకి వచ్చేస్తాడు. (బ్రాహ్మణ రూపంలోనికి). ఇప్పుడా వేషధారి యొక్క క్షత్రియ రూపం అనేది తటస్థ లక్షణం అవుతుంది. అతనిదైన సహజ బ్రాహ్మణ రూపం అనేది స్వరూప లక్షణం. కాబట్టి పరబ్రహ్మ రూపం, స్వరూప లక్షణమైతే, ఉత్పత్తి స్థితి, లయ కాలాల్లో అతనిది తటస్థ లక్షణం అవుతుంది. అంటే, స్వరూప లక్షణం కలిగిన నిర్గుణ బ్రహ్మ మాయచే ఆవరింపబడిన హరిహర బ్రహ్మరూపాలతో తటస్థ లక్షణం కలిగిన సగుణుడౌతున్నాడు. అట్లా సగుణ లక్షణం

కలిగిన ఈశ్వరుడే ఈ జగత్తుకు ఉపాదాన కారుణుడు, నిమిత్త కారణుడు కూడా అవుతున్నాడని భావం. ఉపాసన కోసం ఈ సగుణుడైన ఈశ్వరునే గ్రహిస్తారు.

**జీవుడు:** ఆ చైతన్యమే అంతఃకరణ ద్వారా అవిచ్ఛిన్నమై జీవుడని వ్యవహరింప బడతాడు. శ్రీ శంకరులు, శరీరం మీద, ఇంద్రియ సమూహం మీద శాసనం చేసేటటువంటి, కర్మ ఫలాన్ని అనుభవించేటటువంటి ఆత్మనే జీవుడన్నారు. నిత్య, శుద్ధ, బుద్ధ(జ్ఞాన)ముక్త స్వభావం కల ఆత్మ ఎట్లా పుట్టింది? అనే ప్రశ్నకు సమాధానం – అనిత్యమైనది మాత్రమే పుడుతుంది.(పుట్టినదీ అంటే చావు – నాశనం ఉన్నట్లే గదా!) ఆత్మకు నాశనం లేదు కాబట్టి పుట్టుకాలేదు. అద్వైత వేదాంతాన్ని అనుసరించి పరబ్రహ్మకు, ఆత్మకు భేదం లేదు– రెండూ ఒకటే! పరబ్రహ్మయే ఉపాధి (శరీరం) సంపర్కంవల్ల జీవభావాన్ని పొందుతున్నాడు, అని. ఈ ఆత్మచైతన్యం మనకు జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థల్లోనూ ప్రకటమవుతూ ఉంటుంది. ఈ మూడు అవస్థలోల్నశి మూడు శరీరాలు పనిచేస్తూ ఉంటాయి. ఈ మూడు స్థూల సూక్ష్మకారణ శరీరాలు. ఈ మూడు శరీరాలూ పంచకోశాలచేత ఆవరింపబడి ఉంటాయి– అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు. అంటే– 'జాగ్రదవస్థ'లో స్థూల శరీరం పని చేస్తుంది. ఇది అన్నమయ కోశంతో నిర్మితమైనది. ఈ జాగ్రదవస్థలోని అభిమాన పురుషుని 'విశ్వ' సంజ్ఞతో వ్యవహరిస్తారు. స్వాప్నావస్థలో శూక్ష్మశరీరం పనిచేస్తుంది. ఈ సూక్ష్మ శరీరం ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలచే ఆవరింపబడి ఉంటుంది. ఈ సూక్ష్మ శరీరాభిమానియైన పురుషుడు 'తైజసుడు'. సుషుప్తిలో కారణ శరీరం పనిచేస్తుంది. ఈ కారణ శరీరం ఆనందమయ కోశంచేత కప్పబడి ఉంటుంది. ఈ కారణ శరీరాభిమానియైన పురుషుడు 'ప్రాజ్ఞుడు', శుద్ధ చైతన్యం అనేది – ఆత్మ అనేది ఈ మూడు అవస్థలకు, ఈ అయిదు కోశాలకు కూడా అతీతమైనది. ఇదంతా వ్యష్టి శరీరానికి సంబంధించిన విషయం. సమిష్టి శరీరం అంటే జగత్తు అన్నమాట. ఈ జగత్తు విషయంలో జాగ్రదవస్థలోని పురుషుడు విరాట్ (వైశ్వానరుడు) స్వప్నావస్థలోని పురుషుడు

హిరణ్యగర్భుడు (సూత్రాత్మ) సుషుప్తిలోని పురుషుడు ఈశ్వరుడు. (అవ్యాకృతుడు) అనే సంజ్ఞలు వర్తిస్తాయి. కాని పరమాత్మ మాత్రం ఈ మూడింటికి అతీతమై,

స్వతంత్రమూనదనే విషయం ప్రధానంగా గమనించాల్సి ఉన్నది. ఈ పైన చెప్పిన విషయాన్నే సులభంగా అవగాహన కోసం పట్టికలో చూపిస్తున్నాము.

| | శరీరం | అవస్థ | అభిమానపురుషుడు | కోశములు |
|---|---|---|---|---|
| 1. | స్థూల శరీరం | జాగ్రత్ | సమిష్టి–విరాట్ (వైశ్వానర) వ్యష్టి–విశ్వ | అన్నమయకోశం |
| 2. | సూక్ష్మ శరీరం | స్వప్న గర్భ(సూత్రాత్మ) వ్యష్టి– తైజస | సమిష్టి– హిరణ్య | ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ |
| 3. | కారణ శరీరం | సుషుప్తి (అవ్యాకృత) వ్యష్టి– ప్రాజ్ఞుడు | సమిష్టి– ఈశ్వర | ఆనందమయకోశం |

ఇంతవరకు క్లుప్తంగా ఆత్మను గురించి, జగత్తును గురించి, బ్రహ్మను గురించి అద్వైతపరంగా వివరించటం జరిగింది. ఈ గ్రంథం జగద్గురువులు ఆత్మజ్ఞానాన్ని గురించి వివరించారు కాబట్టి, జ్ఞాన స్వరూపమైన ఆత్మను గూర్చి ఈ వివరణ ఇవ్వటం జరిగింది. ఇక పాఠకులు శ్రీ శంకరుల కవితామకరందాన్ని ఆత్మభోధామృతాన్ని గ్రోలవచ్చు. మధ్యమధ్య ఏవైనా నలుసులు వస్తే వాటిని పరిహరించి మన్నించమని ప్రార్థిస్తున్నాను.

– వ్యాఖ్యాత

# ఆత్మబోధ

(శ్రీమదాద్య శంకరాచార్య విరచితమ్)

*తపోభిః క్షీణ పాపానాం శాన్తానామ్ వీతరాగిణామ్ ।*
*ముముక్షూణామపేక్ష్యో యమాత్మబోధో విధీయతే ॥* 1

శాంతచిత్తులు, తాము చేసిన తపస్సు ద్వారా పాపాలన్నింటిని క్షీణింపజేసుకొన్న వారు, రాగాదులు లేనివారు, సంసార బంధనాల నుండి విముక్తిని కోరేవారు (ముముక్షువులు) ఇటువంటి వారికోసం ఈ ఆత్మబోధ అనే గ్రంథం రచింపబడుతోంది.

ఆత్మజ్ఞానాన్ని ముముక్షువులైనవారు కోరతారు. సంసారులకు అటువంటి మోక్షకాంక్ష ఉండదు. ముముక్షువులైనవారికుండే గుణాలు – శాంత స్వభావం (సత్త్వగుణం) రాగద్వేషాదులు లేకపోవటం, తపస్సులై ఉండటం, పాపాలు లేని వారై ఉండటం అనేవి. ఈ ఆత్మజ్ఞానాన్ని పొందటానికి సాధన చతుష్టయ సంపత్తి ఉండాలన్నారు. (1) నిత్యానిత్య వస్తు వివేకం – ఏది నిత్యమో ఏది అనిత్యమో తెలిసి ఉండటం. (2) ఇహాముత్ర ఫలభోగ విరాగం – ఇహలోక, పరలోక భోగాల ఎడల విరక్తి కలిగి ఉండటం (3) శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానం (సమాధి) శ్రద్ధ అనే ఆరు గుణాలు ఉండటం. (4) ముముక్షుత్వం – మోక్షమందు కోరిక–ఈనాలుగు గుణాలు ఉన్నవారు అధికారులు. అటువంటి యోగ్యత గల అధికారులైన వారికోసం ఈ ఆత్మబోధ రచింపబడుతోంది అని భావం. ఈ శ్లోకంలో గ్రంథ విషయము, గ్రంథ ప్రయోజనము, అధికారి అయినవారెవరు? అనే విషయాలు సూచింపబడ్డాయి.

*బోధో న్యసాధనేభ్యో హి సాక్షాన్మోక్షైక సాధనమ్ ।*
*పాకస్య వహ్నివద్ జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి ॥* 2

ఇతర సాధనాలన్నింటికంటె ఆత్మబోధ (ఆత్మజ్ఞానం) అనేది ఈ సంసారం నుండి విముక్తి పొందటానికి ప్రత్యక్షరూపంలో ఉండే ఏకైక సాధనం. దీనిని మించిన సాధనంలేదు.

ఎట్లాగంటే, అగ్నిలేకుండా ఏ విధమైన వంటలు చేయుటమూ సాధ్యం కానట్లే, జ్ఞానం లేకుండా ముక్తి అనేది లభించదు.

ఈ ప్రపంచం నుండి–జన్మ పరంపరనుండి ముక్తి పొందాలంటే ఆత్మజ్ఞానం ఒక్కటే సాధనం! జ్ఞానంవల్ల తప్ప ఏ ఇతర సాధనాలవల్లనూ ముక్తి లభించదు. (దీనికి కారణమేమో తరువాతి శ్లోకంలో చెపుతారు.) వంటకు కావలసిన బియ్యం, పప్పులు, కూరగాయలు, ఇతర సంభారాలు అన్నీ ఉన్నా, వాటిని వండేటందుకు కావలసిన అగ్ని లేకపోతే భోజన పదార్థాలు తయారు కావు. అగ్ని అనేది వంటకు ఎట్లా ముఖ్యమైన సాధనమో, మోక్షప్రాప్తికి జ్ఞానమనేది కూడా అట్లాగే ప్రధానమైన సాధనం.

*అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్ ।*
*విద్యా విద్యాం నిహన్త్యేవ తేజస్తిమిర సంఘవత్ ॥* 3

కర్మకు అవిద్యతో (అజ్ఞానంతో) విరోధభావం లేకపోవటంవల్ల అది (కర్మ) అవిద్యను నివారించలేదు. ప్రకాశం (తేజస్సు) అంధకారాన్ని పారద్రోలిన విధంగా జ్ఞానం మాత్రమే అవిద్యను పోగొట్టగలుతుంది. అగ్నిని చల్లార్చాలంటే అవసరం. చీకటిని పోగొట్టాలంటే వెలుతురు (తేజస్సు) అవసరం! ఎందుచేత? నీటికి–అగ్నికి విరోధం ఉన్నది. చీకటికి–వెలుతురుకి విరోధం ఉన్నది. అటువంటి విరోధభావం యజ్ఞయాగాది కర్మలకు, అజ్ఞానానికి లేదు. కాబట్టి కర్మలు అవివేకాన్ని పోగొట్టలేవు. అవిద్యను పారద్రోలాలంటే జ్ఞానమే ఏకైక సాధనం! కర్మలవల్ల ప్రయోజనం లేదు– మోక్షప్రాప్తి కలగదు అని భావం.

*పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్ తన్నాశే సతి కేవలః ।*
*స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేంశుమానివ ॥* 4

మేఘంచేత కప్పబడ్డ సూర్యుడు మేఘం తొలగిపోగానే ఏ విధంగా స్వీయ ప్రకాశంతో ప్రకాశిస్తాడో, అదే విధంగా అజ్ఞానమనే ఆవరణం తొలగిపోగానే ఆత్మ తనదైన ప్రకాశంతో ప్రకాశిస్తుంది. స్వయం ప్రకాశమానుడైన సూర్యుడు ఎప్పుడూ ఒకే విధంగా ప్రకాశిస్తాడు. కాని అప్పుడప్పుడు కొంతసేపు మేఘాలు కప్పుతూ ఉంటాయి. ఆ మేఘాల చాటున సూర్యుడు మనకు కనిపించకపోయినా ఎప్పటిలాగా ప్రకాశిస్తూనే ఉంటాడు. ఆ మేఘం యొక్క ఆచ్ఛాదన (కప్పు) తొలగిపోగానే మళ్ళీ మనకు స్వీయ ప్రకాశంతో కనిపిస్తాడు. అట్లాగే ఆత్మను అవిద్య అవరించింది. దేహం ఇంద్రియాలు మొదలైన అవిద్య తొలగిపోగానే ఆత్మ స్వీయ – ప్రకాశంతో ప్రకాశిస్తూ దర్శనమిస్తుంది.

*అజ్ఞాన కలుషం జీవం జ్ఞాచనాభ్యాసా ద్వినిర్మలమ్ ।*
*కృత్వాజ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతక రేణువత్ ॥* 5

జ్ఞానమనేది అజ్ఞానంతో కలుషితమై ఉన్న ఆత్మను విద్యానుశీలనంతో పవిత్రం చేసి దానిలోనే లీనమైపోతుంది. ఎట్లా? బురదనీటిలో కలపబడిన చిల్లగింజయొక్క గంధపు రేణువులు నీటిని శుభ్రం చేసి తాము ఆ నీటిలోనే కలసిపోయినట్లు ! బురదనీటిని శుభ్రం చేయాటానికి చిల్లగింజను అరగతీసి ఆ గంధాన్ని నీళ్ళలో కలుపుతారు. ఆ గంధపు రేణువులు నీటి నుండి బురదను వేరుచేసి అవి ఆ నీటిలోనే కలసిపోతాయి. మళ్ళీ ఆ గంధపు రేణువుల్ని నీటినుండి వేరు చేయలేము. అట్లాగే అజ్ఞానంచేత కలుషితమైయున్నట్టి జీవాత్మను జ్ఞానమనేది స్వచ్ఛంగా చేసి తాను ఆ ఆత్మలోనే లీనమైపోతుంది. అప్పుడిక జ్ఞానానికి, ఆత్మకు, భేదం ఉండదు. ఆత్మ అనేది జ్ఞాన స్వరూప కలదిగదా !– 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని శ్రుతి.

*సంసారః స్వప్న తుల్యోహి రాగద్వేషాది సంకులః*
*స్వప్న కాలే సత్యవద్ భాతి ప్రబోధే సత్యవద్భవేత్॥* 6

రాగద్వేషాదులతో కూడి ఉన్నట్టి ఆ సంసారం–ప్రపంచ స్వప్నంలాంటిది మనం స్వప్నంలో చూస్తున్న విషయాలు, ఆ స్వప్నావస్థ ఉన్నంతవరకు సత్యంగా అనిపిస్తాయి. మళ్ళీ మేల్కనగానే స్వప్నంలో చూచినవన్నీ అసత్యాలని తెలిసిపోతాయి.

ఈ ప్రపంచమనేది రాగం, ద్వేషం మొదలైన అవగుణాలతోకూడి ఉన్నది ఈ సంసారమనేది స్వప్నంలాగానే అసత్యము, అశాశ్వతము. ఎందుచేతనంటే, స్వప్నంలో అనేక విషయాలు, దృశ్యాలు చూస్తున్నాము. ఏవేవో అనుభవాలు పొందుతున్నాము. అవన్నీ సత్యాలనే నమ్ముతున్నాము. మళ్ళీ జాగ్రదవస్థలోకి రాగానే మనం స్వప్నంలో చూచినవి, అనుభవించినవి అసత్యమని తెలుస్తోంది అట్లాగే అజ్ఞానస్థితిలో ఉన్నంతకాలం ఆ సంసారం నిజంలాగానే నమ్ముతున్నాము కాని, జ్ఞానోదయం కాగానే ఇదంతా అసత్యమని తేలిపోతోంది.

*తావత్ సత్యం జగద్భాతి శుక్తి కా రజతం యధా ।*
*యావన్న జ్ఞాయతే బ్రహ్మ సర్వాధిష్ఠానమద్వయమ్ ॥* 7

ఈ సమస్తానికి ఆధారస్వరూపమైనట్టి, అద్వితీయ పరబ్రహ్మను తెలుసుకొనేంత వరకే ఈ సంసారం - ప్రపంచం మనకు ముత్యపుచిప్పను చూచి వెండి అని భావించేటట్లుగా చేస్తుంది.

భ్రాంతిని చెప్పేటప్పుడు రజ్జు సర్పభ్రాంతి (త్రాడును చూచి పాము అని భ్రమించటం), శుక్తి రజతభ్రాంతి (ముత్యపు చిప్పను చూచి దానిని వెండి వస్తువుగా భ్రమించటం) చెపుతారు. దాని యథార్థ స్వరూపాన్ని తెలుసుకునేంతవరకు మనం ఆ ముత్యపుచిప్పను వెండిగానే భావిస్తాము. అట్లాగే, అద్వయుడు- ఈ సమస్త విశ్వానికి ఆధారభూతుడు అయిన పరమాత్మను గుర్తించేంతవరకు ఈ సంసారాన్నే సత్యం అని భ్రమిస్తూ ఉంటాము. సత్య జ్ఞానోదయం కాగానే రజ్జువునందు సర్పమనే భ్రమగాని, శక్తియందు వెండి అనే భ్రమగాని తొలగిపోయినట్టే ఈ సంసారంలో ఉన్న భ్రమ కూడా తొలగిపోయి సత్యబ్రహ్మను గుర్తించగలుగుతాము.\\

*ఉపాదానే ఖిలాధారే జగన్తి పరమేశ్వరే ।*

*సర్గ స్థితిలయాన్యాన్తి బుద్ బుదానీవ వారిణీ ॥* 8

నీటిలో బుడగలు పుడుతున్నాయి. కాసేపు నీటిపై నర్తిస్తాయి. మళ్ళీ ఆ నీళ్ళలోనే కలసిపోతాయి. అట్లాగే ఈ సృష్టికి పరబ్రహ్మ ఉపాదాన కారణం. ఈ సృష్టి అంతా దానికి ఉపాదాన కారణమైన పరబ్రహ్మలోనే పుట్టి, స్థితిని పొంది, మళ్ళీ అందులోనే కలసిపోతుంది. అంటే ఈ సృష్టి అంతా ఆ పరమేశ్వరునిలోనే సృష్టి, స్థితి, లయ రూపాలు పొందుతూ భాసిస్తోంది. సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ పదార్థమే ఈ సృష్టికి కారణం. మళ్ళీ ఈ సృష్టి తనకు కారణమైన బ్రహ్మమందే కలసిపోతుంది.

*సచ్చిదాత్మన్యనుస్యూతే నిత్యే విష్ణౌ ప్రకల్పితాః ।*

*వ్యక్తయో వివిధాః సర్వా హాటకే కటకాదివత్ ॥* 9

ఈ ప్రపంచంలో మనకు విభిన్న పదార్థాలు కనిపిస్తున్నాయి. అవన్నీ కాల్పనికాలే! సత్యాలు కావు! నిత్య జ్ఞాన స్వరూపుడైన పరమాత్మ మాత్రమే సత్యం. దానికి దృష్టాంతం - మనం కడియాలు, కుండలాలు మొదలైన వస్తువులు (నగలను) చూస్తున్నాం. కాని ఆ రూపాలన్నీ కల్పితాలే! వాటి అన్నింటిలోనూ ఉన్న బంగారం. ఒక్కటే సత్యం. !ఈ శ్లోకంలో సత్యాత్మను గూర్చి చెప్పారు. ఇటువంటి అనేక దృష్టాంతాలతో ఉపనిషత్తుల్లో సత్యాత్మ

నిరూపణం చేశారు. ఈ ప్రాపంచిక వస్తుజాలమంతా కాల్పనికం. అందులోనున్న ఆత్మ మాత్రమే సత్యం! ఆభరణాన్ని కరిగించగానే నామరూపాలు నశిస్తాయి. సత్యమైన బంగారం మాత్రమే మిడులుతంది అట్లాగే ఈ ప్రపంచంలోని నామరూపాలన్నీ నశించేవే ! పరమాత్మ మాత్రమే సత్యం.

*యథాకాశో హృషీ కేశోనానోపాధిగతో విభుః ।*
*తద్భేదాద్భిన్నవద్ భాతి తన్నాశాదేకవద్ భవేత్ ॥* 10

ఉపాధినిబట్టి – ఆశ్రయాన్ని బట్టి ఆకాశం వేరువేరుగా కనిపించినట్లు, ఆ ఉపాధి నష్టమైపోగానే అవన్నీ మహాకాశంలో కలిసిపోయినట్లుగా, వేరువేరు ఇంద్రియాలకు అధిష్ఠాతయైన పరమాత్మ ఉపాధిగతమైన భేదాల వల్ల వేరు వేరుగా కనిపించినా, ఆయా ఉపాధులు నష్టమైపోగానే అద్వితీయడైన ఆ పరమత్మ ఒక్కడే మిగిలేది! మనకు కుండలో ఆకాశం (శూన్యం) కనిపిస్తోంది. వస్త్రంలో ఒక నూలుపోగుకు మరియొక నూలుపోగుకు మధ్యనున్నది ఆకాశమే! ఒక గదిలో ఉన్న శూన్యమంతా ఆకాశమే! ఇవన్నీ వాటి వాటి ఆశ్రయాన్నిబట్టి ఘటాకాశం, మఠాకాశంగా కనిపిస్తాయి, వ్యవహరింపబడతాయి. ఈ ఉపాధులన్నీ తొలగిపోగానే వాటిలోని ఆకాశాలు మహాకాశంలో కలసిపోయాతియ అట్లాగే ఈ ఇంద్రియాలన్నింటికి ప్రభువు (హృషీకేశుడు) అయిన పరమాత్మయే, ఉపాధిగతమైన భేదాలవల్ల భిన్నంగా కనిపిస్తాడు. ఈ ఉపాధులు తొలగిపోగా మిగిలేది ఆ అద్వితీయ బ్రహ్మమే!

*నానోపాధి వశాదేవం జాతినామాశ్రయాదయః ।*
*ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్ ॥* 11

నీరు ఆశ్రయ భేదంవల్ల తీయగాను, స్వచ్ఛంగాను, మలినంగాను ఉన్నట్టు కనిపిస్తుంది. అట్లాగే ఆత్మ కూడా వ్యక్తి విశేష సాంగత్యంవల్ల జాతి, వర్ణ, నామభేదాలు ఉన్నట్లుగా కనిపిస్తుంది.

నీరు అనే తత్త్వం ఒకటే! కాని గంగాది నదుల్లోని నీరు తీయగా, స్వాదిష్టంగా ఉంటుంది. మరియొకచోట స్వచ్ఛంగా ఉంటుంది. ఒక చోట నీలవర్ణంలో, ఒకచోట పింగల వర్ణంలో కనిపిస్తుంది కాని, వీటి అన్నింటిలోను ఉన్న తత్త్వం ఒకటే! అట్లాగే విభిన్నమైన ఉపాధుల – ఆశ్రయాల సాంగత్యంవల్ల ఆత్మకూడా అనేక జాతులుగా, పేర్లు కలదిగా కనిపిస్తుందే తప్ప ఆత్మతత్త్వమనేది ఒకటే! అని భావం.

*పంచీకృత మహాభూతసంభవం కర్మసంచితమ్ ।*
*శరీరం సుఖదుఃఖానామ్ భోగాయతన ముచ్యతే ॥* 12

ఈ శరీర మనేది పంచీకరణం చెందిన పంచభూతాల నుండి పుట్టినది. మనం చేసుకొన్నట్టి శుభాశుభ కర్మల ఫలాన్ని అనుభవించటానికి ఈ శరీరమే ఆధారం.

పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనేవి పంచ మహాభూతాలు. వీటి ప్రథము సూక్ష్మాంశాలు – పంచతన్మాత్రలు. అవే శబ్ద, స్పర్శ, రూప, రస గ్రంధాలు. ఆ తన్మాత్రలనుండి పంచభూతాల కలయికవల్ల ఈ శరీరం పుట్టింది. కర్మలవల్ల పుట్టినది అంటే, మనం చేసుకొన్నట్టి పుణ్యకర్మలు గాని, పాపకర్మలు గాని, వాటివల్ల వచ్చే సుఖ దుఃఖాలను అనుభవించటం కోసం ఈ శరీరం పుట్టింది – ఈ అనుభవం అనేది శరీరం వల్లనే జరగాలి కాబట్టి ! 'పంచీకృత మహాభూత సంభవం' అంటే –

పంచతత్త్వాల సమ్మేళనాన్ని ముందు రెండేసిగా విభజించాలి. అంటే పృథివిని రెండు భాగాలు, జలాన్ని రెండు భాగాలు, తేజస్సును రెండు భాగాలు, వాయువును రెండు భాగాలు, ఆకాశాన్ని రెండు భాగాలు మొత్తం పదిభాగాలైనాయి. మళ్ళీ ఒక్కొక్క సగభాగాన్ని నాల్గేసి ఖండాలుగా విభజించాలి. అంటే ఒక్కొక్క భూతము ఎనిమిది, భాగాలైనదన్నమాట. ఇప్పుడు ఒక్కొక్క సగభాగము తనకు భిన్నమైన మిగిలిన నాల్గింటిలోని ఎనిమిదవ భాగంతో చేరటంవల్ల అది పంచీకృతమౌతోంది.

ఉదా॥పృథివిలోని అర్ధభాగాన్ని మిగతాల నాల్గుభూతాలయొక్క 1/8 భాగంతో కలపటంవల్ల పృథివి పంచీకృతమైనది. అట్లాగే జలంయొక్క అర్ధభాగాన్ని మిగిలిన నాల్గు భూతాలయొక్క 1/8 భాగంతో కలుపగా జలం పంచీకృతమైనది. అట్లాగే మిగతా భూతాలు వాటి భాగాలతో కలుస్తాయి. ఈ ప్రక్రియనే పంచీకరణం అంటారు. ఈవిధంగా పంచీకృతమైన మహాభూతములనుండి ఈ శరీరం పుట్టింది. ఈ స్థూలశరీరం – పైకి కనిపించే శరీరం । (ఆత్మానాత్మ వివేకం కూడా చూడండి)

*పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్ ।*
*అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్ ॥*

ప్రాణాపానాది పంచ వాయువులు, మనస్సు, బుద్ధి, పది ఇంద్రియాలు, వీటితోకూడి పంచీకృతమైన మహాభూతాల నుండి ఉద్భవించనట్టి, భగసాధనమైనట్టి శరీరాన్ని సూక్ష్మశరీరం అంటారు.

ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనే పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, అయిదు కర్మేంద్రియాలు (వాక్, పాణి, పాద, వాయు, ఉపస్థ అనేవి) అయిదు జ్ఞానేంద్రియాలు (త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఆఘ్రాణాలు) మొత్తం17 ఇంద్రియాలతో కూడినట్టిది ఈ సూక్ష్మశరీరం. ఈ ఇంద్రియాలకు సరియైన నిర్వచనాలు ఆత్మానాత్మ వివేకంలో ఉన్నాయి) దీనినే లింగశరీరం అని కూడా అంటారు. ఇది పాపపుణ్య కర్మల ఫలాన్ని అనుభవించటానికి సాధనమైనది. ఈ సూక్ష్మశరీరం మనకు స్వప్నావస్థలో భోగ సాధనంగా ఉంటోంది – జాగ్రదవస్థలో స్థూల శరీరంలాగా.

ఉదా॥ మనం స్వప్నంలో నడుస్తున్నాం, పనులు చేస్తున్నాం వింటున్నాం, ఏవేవో చూస్తున్నాం ఆలోచిస్తున్నాం. అయితే స్థూలశరీరం నిద్రపోతోంది– అంటే కాళ్ళు, చేతులు, కళ్ళు చెవులు మొదలైన ఇంద్రియాలు ఏవీ కదలటం లేదు. పనిచేయటం లేదుగదా! స్వప్నంలో ఏ ఇంద్రియాలవల్ల ఈపైన చెప్పినవన్నీ చేస్తున్నాం? అనుభవిస్తున్నాము? అంటే, పైన చెప్పిన 17 ఇంద్రియాలతోనే! ఇవి సూక్ష్మరూపంలో ఉంటాయి. పైకి కనిపించవు. అందుచేతనే దీనిని సూక్ష్మశరీరం అన్నారు. ఈ శరీరం లీనమైపోతుంది – ప్రచ్ఛన్నంగా ఉంటుంది. కాబట్టి లింగశరీరం అన్నారు. శ్రవణ, మననాదుల ద్వారా మాత్రమే దీనిని గ్రహించగలుగుతాం.

*అనాద్య విద్యా నిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే ।*
*ఉపాధిత్రితయాదన్య మాత్మాన మవధారమేత్ ॥* 14

అది (లింగశరీరం) ఆది అనేది లేనట్టిది. మూల ప్రకృతి (అవిద్య) యొక్క సత్వరజస్తమోగుణాత్మకమైనట్టి ఉపాధిని కారణశరీరం అంటారు. ఈ మూడు ఉపాధులకు (స్థూల సూక్ష్మకారణ శరీరాలకు) అతీతమైనట్టి ఆత్మను మనం నిర్ధారణ చేయాలి. ఈ శ్లోకంలో కారణ శరీరాన్ని గురించి చెప్పారు. అనాదియైనట్టిది, అవిద్యా స్వరూపం కలది, – మాయా స్వరూపం కలది, నిర్వచింపరానిది, ఫలానా అని చెప్పటానికి వీలుకానట్టిది అయిన మూల ప్రకృతికి ఉపాధి! దీనినే కారణశరీరం అంటారు. పైన చెప్పినట్టి స్థూలసూక్ష్మశరీరాలు మనకు లభించటానికి ఇదే కారణం కాబట్టి కారణశరీరం అన్నారు. ఈ కారణ శరీరాభిమానియైన పురుషుడు (ప్రాజ్ఞుడు) మనకు సుషుప్తిలో గోచరిస్తాడు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు, జాగ్రత్ స్వప్న సుషుప్తులలో వరుసగా విశ్వ, తైజస, ప్రాజ్ఞులనే పురుషులకు భోగ సాదనాలు.

ఇక ఇప్పుడు మనం ఈ మూడు ఉపాధులకు, అధిష్ఠాతలైన ముగ్గురు పురుషులకు భిన్నమైనట్టి ఆత్మను తెలుసుకోవాలి.

*పంచ కోశాదియోగేన తత్తన్మయ ఇవస్థితః ।*
*శుద్ధాత్మా నీవస్త్రాది యోగేన స్ఫటికో యథా ॥* 15

నీలవస్త్రాదుల సంయోగంవల్ల (కప్పటం వల్ల) స్ఫటికం, ఆయా రంగులు కలదిగా ప్రకాశించినట్లు, అన్నమయాది పంచకోశాలతో కప్పబడి ఉన్న ఆత్మ ఆయా కోవములతో తయారైనదిగానే కనిపిస్తుంది. స్ఫటికం స్వచ్ఛంగా ఉంటుంది. అది పారదర్శకం. దానిని ఏ రంగు గుడ్డతో కప్పితే ఆ రంగుకలదిగా కనిపిస్తుంది. శుద్ధాత్మ కూడా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాలచేత ఆచ్ఛాదింపబడి వుంది. అది స్ఫటికంలాగా తన్మయంగానే కనిపిస్తుంది. అంటే, అన్నమయంగా, ప్రాణమయంగా, మనోమయంగా, విజ్ఞానమయంగా, ఆనందమయంగా కనిపిస్తుంది. కాని యదార్థానికి వీటి అన్నింటికి భిన్నమైనది, అతీతమైనది – ఈ శుద్ధాత్మ !

*వ పునుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యా + వఘాతతః*
*ఆత్మాన మానురం శుద్ధం వి విచ్యాత్ తండులం యథా ॥*

పైన ఉన్నట్టి పొట్టును (ఊకను) తొలగించగానే లోపల ఉన్నట్టి బియ్యపు గింజ చక్కగా వ్యక్తమైనట్టుగానే ఈ పంచకోశాల ఆవరణ తొలగిపోగానే అంతర్యామియైన విశుద్ధాత్మ స్పష్టంగా ప్రకాశిస్తుంది.

అన్నమయాది పంచకోశాలచేత ఆచ్ఛాదింపబడి ఉన్న ఆత్మను అనేకమైన పై పొరలతోకూడిన కొఱ్ఱ ధ్యానపుగింజతో పోలుస్తారు. కొఱ్ఱ ధాన్యపుగింజపై నున్న ఒక్కొక్క పొరను తొలగిస్తూపోతే చివరకు లోపలనున్న బియ్యపుగింజ కనిపిస్తుంది. అట్లాగే అన్నమయాది కోశాలను, ఒక్కొక్క బాహ్య ఆవరణను తొలగిస్తూ పోతే అన్నింటికి లోపల ఉన్న విశుద్ధాత్మ సాక్షాత్కరిస్తుంది అని భావం.

*సదా సర్వగతో ప్యాత్మా న సర్వత్రావభాసతే ।*
*బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥* 17

సర్వదా, సర్వవ్యాపకమైనదైనప్పటికి ఆత్మ సర్వత్ర ప్రకాశింపదు. స్వచ్ఛమైన వస్తువులమీదనే ప్రతిబింబం ఏర్పడునట్లుగా ఆత్మకూడా స్వచ్ఛమైన బుద్ధియందు మాత్రమే భాసిస్తుంది.

ఆత్మ అనేది ఎల్ల కాలాల్లోను, సర్వత్రా–అన్నిచోట్ల వ్యాపించి ఉన్నదైనా, అందరికి అన్నిచోట్ల అది వ్యక్తంకాదు. ఎందుచేత? మన ప్రతిబింబం అద్దంమీద గాని, స్వచ్ఛమైన కదలని నీటిలోగాని, బంగారం, వెండి లాంటి స్వచ్ఛమైన వాటిమీద కనిపిస్తుంది. అంతేతప్ప బురద నీటిలో, ఇనుము మొదలైన మలిన పదార్థాలలో కనిపించదు. అట్లాగే ఆత్మ అనేది విశుద్ధమైన బుద్ధియందు (జ్ఞానంలో) మాత్రమే ప్రకాశిస్తుంది. ఇతరమైన ఇంద్రియాలకు గోచరించదు అని భావం.

*దేహేంద్రియ మనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।*
*తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్ సదా ॥18*

ఆత్మ అనేది దేహం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి వీటి అన్నింటికి అతీతమైనది. ఆత్మ అనేది రాజులాగా శరీరం, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవాటి పనులకు సాక్షిగా ఉంటుంది.

రాజు అయినవాడు తానేమీ చేయడు. సేవకులు, ఉద్యోగులు చేసే పనులను చూస్తూ (సాక్షిలాగా) ఉంటాడు. ఆత్మ కూడా అట్లాగే ఈ ప్రకృతిలోని సమస్త కార్యాలకు సాక్షిగా ఉంటుంది. ఆ కార్యాలన్నీ చేసేది పైన చెప్పిన దేహేంద్రియ మనోబుద్ధులు.

*వ్యావృత్తే ష్వింద్రి యేష్వాత్మా వ్యాపారీవా వివేకినామ్ ।*
*దృశ్యతే భ్రేషు ధావత్సు ధావన్నివ యథాశశీ॥*

కదులుతూ ముందుకుపోతున్న మేఘాలలోని చంద్రుడు మనకు పరుగెత్తుతూ ఉన్నట్టు కనిపిస్తాడు. అట్లాగే వివేకహీనులైనట్టి వారికి ఇంద్రియాలు వాటివాటి పనులుచేస్తూ ఉన్నప్పుడు ఆత్మయే ఆ పనులన్నీ చేస్తున్నట్లుగా అనిపిస్తుంది. పనులు చేసేది ఇంద్రియాలు కానీ, ఆత్మ చేస్తున్నట్లుగా అజ్ఞానులు భావిస్తారు.

పరుగెత్తేవి మేఘాలైనా చంద్రుడు పరుగెత్తుతూన్నాడని భావించినట్లు! ఇంద్రియ కార్యాలకు ఆత్మ, కర్తకాదని ద్రష్టమాత్రమేనని భావం.

*ఆత్మచైతన్య మాశ్రిత్య దేహేన్ద్రియ మనోధియః*
*స్వకీయార్థేషు వర్తన్తే సూర్యాలోకం యథాజనాః॥*

సూర్యుని ప్రకాశాన్ని ఆధారంగా గ్రహించి జనులంతా తమతమ కార్యాలు చేస్తూ ఉన్నట్లుగానే, దేహము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఇవన్నీ ఆత్మయొక్క చైతన్యాన్ని ఆశ్రయించి, ఆ పరమాత్మను అనుసరించి తమ పనులలో ప్రవృత్తుమౌతున్నాయి.

*దేహేన్ద్రియ గుణాన్ కర్మణ్యమలే సచ్చిదాత్మని ।*
*అధ్యస్యన్తే వివేకేన గగనే నీలతాదివత్ ॥*

జనసామాన్యమంతా, తమ అవివేకంవల్ల ఆకాశాన్ని చూచి, అది నీలంగా ఉన్నదని అనుకోవటం చూస్తూనే ఉన్నాము. నిజానికి ఆకాశానికి రంగు అంటూ ఏమీ లేదు. అట్లాగే, అత్యంత నిర్మలమైన పరమాత్మయందు దేహాన్ని ఇంద్రియాలను, గుణరూపాలను ఇంద్రియాలుచేసే శుభాశుభ కార్యాల్నీ ఆరోపిస్తున్నాం. అంతే తప్ప, ఈ నామరూప గుణాదులతో, శుభాశుభ కర్మలతో, దేహేంద్రియాలతో ఆత్మకు ఏమీ సంబంధంలేదు అని భావం.

*అజ్ఞాన న్మానసోపాధేః కర్తృత్వాదేని చాత్మని ।*
*కల్ప్యన్తే మ్బుగతే చన్ద్రే చలనాదిర్య థామ్భసః॥*

నీటిమీద చంద్రుడు ప్రతిబింబిస్తున్నాడు. నిజానికి చంద్రుడు నిలకడగానే ఉన్నా నీటియొక్క కదలికవల్ల దానిపై నున్న చంద్రుని ప్రతిబింబం కదులుతూ ఉన్నట్లు కనిపిస్తుంది. అట్లాగే మానవుడు చేసే కార్యాలన్నింటికి కర్తృత్వం మనస్సుదే అయినప్పటికి, అజ్ఞానంవల్ల ఆయా కార్యాలన్నీ ఆత్మ చేస్తూన్నట్లుగా కనిపిస్తుంది. యధార్థానికి ఆయా పనులతో ఆత్మకేమీ సంబంధంలేదు. చంద్రునికి నీటితో సంబంధం లేనట్లు.

*రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే ।*
*సుషుప్తౌ నాస్తి తన్నా శే తస్మాద్ బుద్ధేస్తు నాత్మనః॥*

రాగము (సుఖతృష్ణ) కోరికలు, సుఖాలు, దుఃఖాలు ఇవన్నీ బుద్ధిలో ప్రవర్తితమయ్యే ప్రక్రియలే ! గాఢమైన నిద్రలో (సుషుప్తిలో) ఈ బుద్ధి నశించిపోతోంది. అప్పుడు ఈ రాగాదులైన భావాలు కూడా నశించిపోతున్నాయి. బుద్ధి పని చేసినంతవరకే ఇవన్నీ

పనిజేస్తాయి. ఈ అనుభూతివల్ల పుట్టే ఈ పనులన్నీ (రాగాదులన్నీ) ఆత్మకు సంబంధించినవి కావు.

*ప్రకాశో ర్కస్య తోయస్య శైత్య మగ్నేర్యథోష్ణతా ।*
*స్వభావః సచ్చిదానంద నిత్య నిర్మల తాత్మన : ॥24*

సూర్యునికి ప్రకాశం, నీటికి చల్లదనం, అగ్నికి వేడి, ఎట్లా స్వాభావికమో అట్లాగే ఆత్మకు ఆనందం, నిత్యత్వం (శాశ్వతత్వం) నిర్మలత్వము అనేవి సహజమైన గుణాలు. ఆత్మకు గుణాలనే వాటిని ఆరోపించటానికి వీలు లేకపోయినా, ఆత్మ స్వభావాన్ని తెలియజేయటానికి నిత్యత్వ, నిర్మలత్వ, సచ్చిదానంద గుణాలను చెప్పారు.

*ఆత్మనః సచ్చిదంశశ్చ బుద్ధేర్వృత్తిరితిద్వయమ్ ।*

సంయోజ్య వా వివేకేన జానామితి ప్రవర్తతే ॥జ్ఞానమనేది బుద్ధి యొక్క ధర్మల. అంతేకాని ఆత్మయొక్క ధర్మం కాదు. ఆత్మ అనేది సత్‌చిత్ ఆనందస్వరూపం. సత్యము, చైతన్యము. ఆనందము స్వరూపముగా కలది. జనులు ఈ విషయం తెలుసుకోలేక ఈ బుద్ధిని ఆత్మను రెంటిని కలిపి (కర్తగా చేసి) 'ఎరుగుదును' అని అంటూ ఉంటారు. ఎరుగుట అనేది జ్ఞానం. అది బుద్ధి ధర్మం. ఆత్మ ధర్మం కాదు. ఎరుగుట, లేక తెలిసికొనుట అనే క్రియకు ఆత్మ కర్త కాదు అని భావం.

*ఆత్మనో విక్రియానాస్తి బుద్ధే ర్బోధోన జాత్వితి ।*
*జీవ : సర్వమలం జ్ఞాత్వా జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి ॥   26*

ఆత్మకు సుఖదుఃఖాది వికారాలు ఉండవు. బౌద్ధిక జ్ఞానం ఉండదు. బుద్ధి ధర్మమైనది జ్ఞానం. ఆత్మ ధర్మమని అనుకుంటారు. బుద్ధి ఆత్మను సుఖదుఃఖాది వి కారాలు ఉన్నదానినిగా భావిస్తుంది. జీవాత్మ ఈ విషయాలన్నీ తెలిసికూడా నేను జ్ఞాతను నేను ద్రష్టను' అనే మోహంలో పడుతూ ఉంటుంది. ఆత్మ జ్ఞాన స్వరూపం కలది. అంటే జ్ఞానమే ఆత్మ అని భావం.

*రజ్జు సర్వవదాత్మానం జీవో జ్ఞాత్వా భయం వహేత్ ।*
*నాహం జీవః పరాత్మేతి జ్ఞానం చేన్నిర్మలో (న్నిర్భయో) భవేత్ ॥27*

జీవుడు త్రాటిని చూచి పాము అని భ్రమించి భయపడినట్లుగా, మిథ్యా జ్ఞానంతో జీవుడు ఆత్మకు తెలుసుకొని భయభీతుడౌతున్నాడు. 'నేను జీవుణ్ణి కాను, నేను పరమ్మాతను'

అనే సత్యం ఎప్పుడు గ్రహిస్తున్నాడో అప్పుడు భయం నుండి విముక్తుడౌతున్నాడు. అంటే జీవుడు తాను వేరు. పరమాత్మ వేరు అనే భేదభావం కలిగి ఉన్నంతవరకు త్రాటిని చూచి పాము అనుకొని భయపడ్డట్లు భయపడుతున్నాడు. అహం బ్రహ్మాస్మి – నేనే బ్రహ్మను అనే అద్వైతభావం కలగటంతోనే భయం పోతుంది. నిర్మలుడౌతున్నాడు.

*ఆత్మావ భాసయత్యేకో బుద్ధ్యాదీనీంద్రియాణి హి ।*
*దీపో ఘటాదివత్ స్వాత్మా జడైస్తైర్నావ భాస్యతే ॥*

ఘటాదులకు – కుండ మొదలైన జడ వస్తువులకు స్వయం ప్రకాశ శక్తి లేదు – తమంత తాముగా వ్యక్తం కావు. దీపం వల్ల వ్యక్తమౌతాయి. దీపకాంతిలో కనిపిస్తాయి. దీపం జడపదార్థాల్ని వ్యక్తం చేసినట్లే ఆత్మ అనేది బుద్ధి మొదలైన ఇంద్రియాలన్నింటిని ప్రకాశింపచేస్తుంది. ఇంద్రియాలన్నీ అచేతనాలు కాబట్టి వాటికి తమంత తాముగా ప్రకాశించే శక్తి లేదు. ఘటాదులవల్ల దీపం వ్యక్తం కావటంలేదుగా! అట్లాగే ఇంద్రియాలవల్ల ఆత్మ ప్రకాశితం కావటంలేదు. ఆత్మవల్లే ఇంద్రియాలకు పని చేసే సామర్థ్యం వస్తోంది– చైతన్యాన్నిచ్చే ఆత్మ లేకపోతే అవి పని చేయలేవు.

*స్వబోధే నాన్యబోధేచ్ఛా బోధరూప తయాత్మనః।న దీపస్యాన్య*
*దేపేచ్ఛా యథా స్వాత్మప్రకాశనే ॥*

దీపం వెలుగుతోంది. దీపానికి స్వాత్మ ప్రకాశన సామర్థ్యం ఉన్నది. అంటే తనను తాను కనిపించేటట్లు చేసుకోనే శక్తి ఉన్నది. అందుచేత దీపం మరొక దీపాన్ని ఆశించదు– తనను ప్రకాశింపచేసుకోవటానికి! ఒక దీపాన్ని చూపించటానికి మరొక దీపం అవసరం లేదుగదా! అట్లాగే, ఆత్మ జ్ఞాన స్వరూపమైనది కాబట్టి, ఆత్మ జ్ఞానం పొందటానికి అన్యజ్ఞానాన్ని అభిలషించదు.

*నిషిద్ధ్య నిఖిలో పాధీన్నేతి నేతీతి వాక్యత ః॥*
*విద్యాదైక్యం మహావాక్యై ర్జీవాత్మ పరమాత్మనోః॥*

నేతి నేతి (న+ఇతి= ఇదికాదు, ఇదికాదు) అనే వాక్యం ద్వారా సమస్తమైన ఉపాధుల్ని, సమస్త విషయాల్ని 'ఇది బ్రహ్మ కాదు, ఇది బ్రహ్మ కాదు' అని నిషేధిస్తూ చివరకు 'సో హమస్మి ' – ఆ బ్రహ్మనే నేను, తత్త్వమసి – ఆ బ్రహ్మవు నీవే ! అనే మహా

వాక్యాల ద్వారా జీవాత్మ పరమాత్మల అభిన్నతను తెలుసుకోవాలి ! మనకు కనిపించే సమస్త పదార్థాల్నీ (అవి అశాశ్వతం కాబట్టి) ఇది 'బ్రహ్మకాదు అని నిషేధిస్తూ పోతే చివరకు మిగిలేది తానే ! ఆత్మయే ! అప్పుడు జీవుడు 'ఆ పరబ్రహ్మను నేనే– 'సో హమస్మి' అని గుర్తిస్తాడు. అంటే ఆత్మకు పరమాత్మకు భేదం లేదని గుర్తిస్తాడు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'– సమస్తము బ్రహ్మమే ! ఆ బ్రహ్మమే నేను అనే స్థితికి వస్తాడు. ఇది అభేదస్థితి – అద్వైతస్థితి. సో హమస్మి, తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ ఇటువంటివన్నీ వేదాంతశాస్త్రంలో మహావాక్యాలుగా ప్రసిద్ధి పొందాయి.

*ఆ విద్యకం శరీరాది దృశ్యం బుద్బువత్ క్షరమ్ ।*
*ఏతద్విలక్షణం విద్యాదహం బ్రహ్మేతి నిర్మలమ్ ॥*

అవిద్యా నిబంధితమైన ఈ స్థూలశరీరం నీటి బుడగలాగా క్షణికమైనది – నశ్వరమైనది. ఈ స్థూలశరీరానికి భిన్నమైనట్టి బ్రహ్మను 'అహం బ్రహ్మాస్మి – నేనే బ్రహ్మను, నేనే స్వచ్ఛమైన నిర్మలమైన బ్రహ్మను' అనే విషయం తెలుసుకోవాలి. అంటే శరీరంలో ఆత్మభావం పోవాలి – శరీరం ఆత్మ అనే భావం పోవాలి. శరీరం యొక్క క్షణభంగురత్వాన్ని గుర్తించి 'నేనే బ్రహ్మను' అనే స్థితిని పొందాలి.

*దేహాన్య త్వాన్న మే జన్మజరా కార్శ్యలయాదయ:*
*శబ్దాది విషయై: సంగో నిరింద్రియ తయా న చ॥*

'నేను (ఆత్మ) శరీరంకంటే విలక్షణమైనందున, పుట్టుక, ముసలితనం, క్షీణించటం, మృత్యువు మొదలైనవి నాకు లేవు. ఉత్పత్తి, స్థితి, లయాదులు శరీరానికే తప్ప నాకు లేవు (ఆత్మకు లేవు). అట్లాగే ఇంద్రియాలు, వాటి విషయాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదుల సంపర్కమూ నాకు లేదు. వీటికి నాతో (ఆత్మతో) ఏ విధమైన సంబంధమూ లేదు!' ఇక్కడ 'నేను' 'నాకు' అంటే అహం – బ్రహ్మాస్మి అనే అనుభవంతో అద్వైతసిద్ధి కలిగినవానికి అని భావం.

*అమన స్త్వాన్న మే దుఃఖరాగ ద్వేష భయాదయ: ।*
*అప్రాణో హ్యమనాః శుభ్ర ఇత్యాది శ్రుతిశాసనాత్ ॥*

వేదానుశాసనాన్ని అనుసరించి – వేదాల్లో చెప్పబడిన దానినిబట్టి ఆత్మ అనేది ప్రాణంకంటె భిన్నమైనది – ఆత్మ అంటే ప్రాణం కాదు. మనస్సు కంటె భిన్నమైనది.

ఆత్మ అంటే మనస్సుకారు. ఆత్మ అనేది మనస్సుకంటే ప్రాణంకంటె విలక్షణమైనది. ప్రాణం కంటే విలక్షణమైనది కాబట్టి దానికి చావు లేదు. మనస్సుకంటె విలక్షణమైనది కాబట్టి దుఃఖం, రాగం, ద్వేషం భయం మొదలైన మానసిక గుణాలు ఆత్మకు లేవు.

*నిర్గుణో నిష్క్రియో నిత్యో నిర్వి కల్పో నిరంజనః ।*
*నిర్వకారో నిరాకారో నిత్యముక్తో స్మి నిర్మలః ॥*

నేను (ఆత్మను) నిర్గుణుడను – సత్త్వరజసమో గుణాతీతుడను. నేను నిష్క్రియుడను – చేయవలసిన పనులు నాకేమీ లేవు. నిత్యుడను – అక్షయుడను, నాశనం లేనివాడను. నిర్వికల్పుడను – ప్రాపంచిక విషయాలేవీ నాకు అంటవు. నిరంజనుడను – నిర్మలుడను. నిర్వికారుడను – మార్పులేనివాడను. సదా బంధముక్తుడను – నాకు ఏ విధమైన బంధనములు లేవు. నిర్మలమైన స్వభావం కలవాడను. ఇవన్నీ ఆత్మ లక్షణాలు – పరమాత్మ లక్షణాలు.

*అహమాకాశవత్ సర్వబహిర స్తర్గతో చ్యుతః ।*
*సదాసర్వసమః శుద్ధో నిఃసంగో నిర్మలో చలః ॥*

నేను (ఆత్మనైన నేను) ఆకాశంలాగా సమస్త విశ్వంలోను, లోపల, బయట కూడా వ్యాప్తమై ఉన్నాను – విశ్వమంతటా అని భావం. నేను అచ్యుతుడను – అవినాశియైన వాడను. అందరికి, అన్ని వేళల, పక్షపాత రహితంగా, ఒకే విధంగా ఉండేవాడను. పరిశుద్ధుడను, నిర్లిప్తుడను – ప్రాపంచిక విషయాలేవీ నాకు అంటవు. నిర్మలుడను – పాపం లేనివాడను. స్థిరమైనవాడను

*నిత్యశుద్ధ విముక్తైక ముఖండా నన్దమద్వయమ్ ।*
*సత్యం జ్ఞాన మనన్తం యత్పరం బ్రహ్మాహమేవ తత్ ॥*

నిత్యము, శుద్ధస్వరూపము, బంధవిముక్తము, అద్వితీయము, అఖండము, ఆనంద స్వరూపము, నిరూపనమానము, సత్య స్వరూపము, జ్ఞాన స్వరూపము, అనంతము అయిన ఆ పరబ్రహ్మను నేనే ! ఆత్మయే । అని భావం.

*ఏవం నిరంతరం కృత్వా బ్రహ్మైవాస్మీతి వాసనా ।*
*హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥*

పైన చెప్పిన విధంగా నిరంతరం 'నేనే బ్రహ్మను' అని భావిస్తూ ఉండటంవల్ల కలిగే సంస్కారం, రోగాన్ని ఔషధం ఏ విధంగా పోగొడుతుందో అదే విధంగా మోహ విలసితములైన వాటిని – అవిద్యా జన్యమైన అవలక్షణాలను అది (పైన చెప్పిన సంస్కారం) పోగొడుతుంది.

*వివిక్త దేశ ఆసీనో విరాగీ విజితేంద్రియాః ।*
*భావయే దేతమాత్మానం తమనన్త మనన్యధీః ॥*

అందుచేత ఏకాంతమైన ప్రదేశంలో కూర్చుండి, విషయం వాసనల యెడల విరక్తుడై, ఇంద్రియాలను జయించినవాడై, ఏకాగ్రచిత్తంతో ఈ విధమైన ఆత్మచింతనం చేయాలి – ఆత్మను గూర్చిన ఆలోచన చేయాలి.

*ఆత్మన్యేవాఖిలం దృశ్యం ప్రవిలాప్య ధియా సూధీః ।*
*భావయేదేక మాత్మానం నిర్మలాకాశవత్సదా ॥*

విద్వాంసుడైనవాడు – ప్రాజ్ఞుడు, తన బుద్ధి ద్వారా ఆత్మలోనే సమస్త ప్రాపంచిక వస్తువులను అంతర్హితం చేసి – లీనం చేసి, నిర్మలమైన ఆకాశంలాగా అద్వితీయమైన బ్రహ్మను గూర్చి చింతన చేయాలి. ఆకాశం అనంతమైని. సమస్తమూ దానియందు లీనమైన ఉంటుంది. ఆత్మ అనంతమైనది. కాబట్టి సమస్త ప్రపంచాన్ని ఆత్మలోనే లీనం చేసేయాలి. ప్రాపంచిక వాసనలకు అతీతం కావాలి. ఆ స్థితిలో బ్రహ్మను గూర్చి చింతన చేయాలి. రూపవర్ణాదికం సర్వం విహాయ పరమార్థవిత్ ।పరిపూర్ణ – చిదానంద – స్వరూపేణా వతిష్ఠతే ॥ ఈసమస్తవిశ్వము పరబ్రహ్మస్వరూపమే అనే పరమార్థాన్ని – పరమసత్యాన్ని తెలుసుకున్నవాడే సత్యవేత్త. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే మహావాక్యాని అనుభవంలోకి తెచ్చుకున్నవాడు బ్రహ్మవేత్త అన్నమాట. ఈ ప్రపంచంలో కనిపించే నామ, రూప వర్ణాదులన్నింటిని – స్వరూపాలు, జాతులు, వర్ణాలు మొదలైన భేదాలన్నింటిని వదలిపెట్టి, అఖండమైనట్టి, పరిపూర్ణుడైనట్టి, ఆనందస్వరూపుడైనట్టి పరబ్రహ్మలో తత్స్వరూపాన్ని – 'సో హహస్మి = ఆ బ్రహ్మమే నేను' అనే భావాన్ని పొందుతాడు.

*జ్ఞాతృ జ్ఞాన జ్ఞేమ భేదః పరాత్మని న విద్యతే ।*
*చిదానందైక రూపత్వాద్ దీప్యతే స్వయమేవ హి ॥*

పరమాత్మలో జ్ఞాత (తెలుసుకొనేవాడు) జ్ఞానము, జ్ఞేయము (తెలుసుకొదగినది) అనే బేధం లేదు. అంటే ఈ మూడింటికి లేదు. అన్నీ కలిపి ఒకటే! అతడే జ్ఞానానంద స్వరూపుడు. కాబట్టి తనంతటతానే ప్రకాశిస్తూ ఉంటాడు – స్వయంప్రకాశం కలవాడు.

*ఏవమాత్మా రణౌ ధ్యానమథే సతతం కృతే ।*
*ఉదాతావ గతి ర్జ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥* 43

ఈ విధంగా, ఆత్మనే ఆరణిగా (అగ్నిని రగుల్కొల్పేందుకు ఉపయోగించే జమ్మిచెట్టు కఱ్ఱ) నిరంతర ధ్యానమే (మననమే) మథనం కాగా (రాపిడిగా) దానినుండి పుట్టిన అవబోధమనే జ్వాల (జ్ఞానాగ్ని) లో అజ్ఞాన స్వరూపమైన కట్టెలన్నీ తగులబడిపోతాయి.

అగ్నిని రగుల్కొటానికి రెండు కఱ్ఱలతో రాపిడి పుట్టిస్తారు. అట్లాగే ఆత్మ, పనిరంతర ధ్యానం అనే ఈ రెంటి రాపిడివల్ల జ్ఞానాగ్ని పుడుతుంది. ఆ జ్వాలలో అవిద్యాజన్యమైనవన్నీ కట్టెలలాగా భస్మమైపోతాయి.అరుణేనైవ బోధేన పూర్వం సన్తమసం హృతే ।తత ఆవిర్భావేదాత్మా స్వయమేవాంశుమానివ ॥అరుణోదయం కాగానే అంతకుపూర్వం వరకు ఉన్న గాఢాంధకారం నష్టమైపోతుంది. సూర్యడు స్వయంప్రకాశమానుడౌతాడు. అట్లాగే జ్ఞానోదయం కాగానే అంతవరకు చీకటిలాగా ఆవరించి ఉన్న మోహమనే అంధకారం పటాపంచలౌతుంది – నశించిపోతుంది. సూర్యునిలాగా ఆత్మ స్వయం ప్రకాశమాన మౌతుంది.

*ఆత్మాతు పతతం ప్రాప్తో ష్య ప్రాప్తవదవిద్యమా ।*
*తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా ॥* 44

ఆత్మ అనేది ఎల్లప్పుడు సన్నిహితంగానే ఉంటుంది. ఎప్పుడో, ఎక్కడినుండో వచ్చేది కాదు. కాని అవిద్య కారణంగా అది సన్నిహితమై లేనట్టుగా అనిపిస్తుంది. అట్లా, ఆత్మను ఆచ్ఛాదించి, సన్నిహితం కానట్టుగా కనిపింపచేసే అవిద్య – అజ్ఞానం నశించటంతోనే తన కంఠాన్ని అలంకరించి ఉన్న హారంలాగా అది (ఆత్మ) ప్రత్యక్షంగా ప్రతీతమౌతుంది – కనిపిస్తుంది.

*స్థాణౌ పురుషవద్ భ్రాన్త్యాకృతా బ్రహ్మణి జీవతా ।*
*జీవస్య తాత్వికం రూపం తస్మిన్ దృష్టే నివర్తతే ॥* 45

ఆకులు రెమ్మలు ఏవీ ఏకుండా ఎండిపోయిన చెట్టు మొద్దును స్థాణువు అంటారు. అటువంటి చెట్టు మొద్దును చూచి పురుషాకృతిలాగా – ఎవడో మానవాకారంలాగా భ్రమపడతారు. అట్లాగే పరబ్రహ్మమందు జీవభ్రాంతి ఉంటుంది. ఆత్మ యొక్క ప్రత్యక్ష జ్ఞానం కలగగానే బ్రహ్మయందున్న జీవభావం – ఆ భ్రాంతి దూరమైపోతుంది. స్థాణువును మనిషి అనుకోవటం బ్రహ్మను జీవుడనుకోవటం భ్రాంతి, ఈ భ్రాంతి అవిద్య వల్ల తలుగుతోంది. ఆత్మజ్ఞానం కలగటంతోనే – అవిద్య తొలగటంతోనే – ఈ భ్రాంతి కూడా తొలగిపోతుంది. బ్రహ్మావబోధనం కలుగుతుంది.

*తత్త్వ స్వరూపను భవాదుత్పన్నం జ్ఞానమంజసా ॥*
*అహం మమేతి చాజ్ఞానం బాధతే దిగ్భ్రమాదివత్ ॥ 46*

తత్త్వ స్వరూపానుభవం వల్ల, అంటే, పైన చెప్పినట్టి బ్రహ్మావ బోధనం కలగటంవల్ల, అట్లా జనించిన జ్ఞానంలో 'నేను, నాది' అనే మోహం, మమకారం పటాపంచలైపోతుంది. ఏ దిక్కు ఏ దోవ తోచక పోవటం, ఒక దిక్కును వేరొక దిక్కుగా భావించటం దిగ్భ్రమ. ఇతర చోట్లకు పోయినప్పుడు ఈ దిగ్భ్రమకులోనౌతారు. సూర్యోదయం కాగానే సూర్యుని చూచినందున తూర్పుదిక్కు తెలిసిపోతుంది. దానితో మిగతా దిక్కులన్నీ తెలిసిపోతాయి. అట్లాగే జీవుడు 'నేను నాది' మోహంలో పిడి కొట్టుకొంటూ ఉంటాడు అదే మమకారం. పైన చెప్పిన తత్త్వ స్వరూప జ్ఞానం కలగటంతోనే ఆ మోహం తొలగిపోతుంది. స్వస్వరూప జ్ఞానం తలుగుతుంది.

*సమ్యగ్విజ్ఞానవాన్ యోగీ స్వాత్మన్యేవాఖిలంజగత్।*
*ఏకంచ సర్వమాత్మానమీక్షతే జ్ఞానచక్షుషా ॥ 47*

మంచి తాత్త్విక విజ్ఞానం కలిగినట్టి యోగి, తన జ్ఞాన దృష్టితో తనలోనే సమస్త విశ్వాన్ని అద్వితీయమైన ఆత్మరూపంగా దర్శిస్తాడు. అంటే, ఈ దృశ్యమానమయ్యే సమస్త విశ్వమూ బ్రహ్మస్వరూపమే ! ఈ సమస్త విశ్వాన్ని బ్రహ్మస్వరూపంగా తనలోనే దర్శిస్తాడు – అదే ! ఆత్మ రూపంగా దర్శించటమంటే !

*ఆత్మైవేదం జగత్ సర్వమాత్మనో న్యన్న విద్యతే*
*మృదో యద్వత్ ఘటా దీని స్వత్మానం సర్వమీక్షతే ॥ 48*

ఈ సమస్త విశ్వము బ్రహ్మమే ! పరమాత్మయే తప్ప ఇంకేమీ కాదు. మట్టి లేకుండా కుండ ఎట్లా ఉంటుంది . పైన పేర్కొన్న తత్త్వవేత్తయైన యోగి, మట్టి లేకుండా కుండ మొదలైన నామరూపాలు గల వస్తువులు ఎట్లా ఉండవో, అట్లాగే పరబ్రహ్మ లేకుండా ఈ నామరూపాత్మకమైన జగత్తూ ఉండదు, అని తెలుసుకొని సమస్తాన్ని ఆత్మ స్వరూపంలో చూస్తాడు. ఈ విశ్వం అంతా పరమాత్మ స్వరూపం! నామరూపాలు కలిగిన కుండలో సత్యపదార్థం మట్టి. అట్లాగే నామరూనాత్మకమైన ఈ సృష్టిలో సత్యపదార్థం పరబ్రహ్మమే ! యోగియైనవాడు ఆ పరబ్రహ్మకు ఆత్మకు బేధం చూడదు. విశ్వాన్ని ఆత్మరూపంలోనే దర్శిస్తాడు.

*జీవన్ముక్తస్తు తద్విద్వాన్ పూర్వోపాధి గుణాం స్త్యజేత్ ।*
*సచ్చిదానంద రూపపత్వం భజేద్ భ్రమరకీటవత్ ॥* 49

పైన పేర్కొనబడిన యోగి – తాత్త్విక విజ్ఞానం కలవాడు. అతడు జీవన్ముక్తుడు. అంటే జీవించి ఉండగానే అవిద్యా బంధనాలనన్నింటిని–సంసార బంధానాలనన్నింటిని తొలగించుకొన్నవాడు. అతడు తాను లోగడ అనుభవించిన సాంసారిక గుణాలనన్నింటిని, విషయ వాసనలను భ్రమరకీట న్యాయంగా వదలివేస్తాడు. తుమ్మెద తాను లోగడ మకరందాన్ని పీల్చివేసిన పద్మాన్ని వదలివేసినట్లుగా ఈ యోగి కూడా తాను లోగడ అనుభవించిన సాంసారిక గుణాలను వదలివేస్తాడు. ఆ విధంగా జీవన్ముక్తుడై, సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మతో ఏకీభావాన్ని పొందుతాడు.

*తీర్త్వా మోహార్ణవం హత్వా రాగద్వేషాది రాక్షసాన్ ।*
*యోగీ సర్వ సమాయుక్త ఆత్మారామో విరాజతే ॥* 50

యోగియైనవాడు రాగద్వేషాదులనే రాక్షసుల్ని వైరాగ్యంతో జయించి అజ్ఞానమనే సముద్రాన్ని జ్ఞానం సహాయంతో–సాధనంగా దాటి, సాంసారికమైన భావాలన్నింటిని వదలివేసి తన ఆత్మయందు తానే రమిస్తూ ఉంటాడు – శోభిస్తూ ఉంటాడు. ఆత్మారాముడై అంటే బ్రహ్మనిష్ఠుడై ఉంటాడని భావం.

*బాహ్యే నిత్య సుఖాపక్తిం హిత్వాత్మసుఖ నిర్వృతః*
*ఘటస్థదపవత్ స్వచ్ఛమన్తరేవ ప్రకాశతే ॥* 51

బాహ్యమైనట్టి, నశ్వరమైనట్టి సాంసారిక సుఖాలమీది ఆసక్తిని వదలిపెట్టి, బ్రహ్మజ్ఞానం కలిగి, నిర్మలమైనట్టి ఆంతరికమైన ఆనందంలో యోగులైనవారు. ప్రసన్నభావంతో కుండలో ఉన్న దీపంలాగా ప్రకాశిస్తూ ఉంటారు. కుండలోనున్న దీపానికి బయటి నుండి గాలి యొక్క తాకిడి లేనందువల్ల నిశ్చలంగా, నిర్మలంగా వెలుగుతూ ప్రకాశిస్తూ ఉంటుంది. అట్లాగే యోగులు బాహ్యసుఖాసక్తి నేనందువల్ల, విషయ వాసనల తాకిడి లేనందువల్ల నిశ్చలంగా జ్ఞానానందాన్ని అనుభవిస్తూ ప్రకాశిస్తూ ఉంటారు.

*ఉపాధిస్థో పి తద్ధర్తై ర్లిల్గిప్తో వ్యోమవన్మునిః ।*
*సర్వ విన్మూఢవత్ తిష్ఠే దసక్తో వాయువచ్చరేత్ ॥* 52

ఋషీశ్వరులైనట్టి మహాత్ములు, శరీరంతో ఉండికూడా ఆకాశంలాగా శరీర ధర్మాలతో నిర్లిప్తులై ఉంటారు. ఆకాశానికి ఏమీ అంటనట్లుగా యోగులుకూడా శరీర ధర్మాలను అంటకుండా ఉంటారు. అన్నీ తెలిసికూడా ఏమీ ఎరుగని మూఢలలాగా కనిపిస్తారు. (కేవల లౌకిక దృష్టిలో చూచే మూఢులకు) లోకంలో తిరుగుతూ కూడా ఏ విధమైన ఆసక్తీలేకుండా వాయువు వీస్తున్నట్లుగా వ్యవహరిస్తూ ఉంటారు.

*ఉపాధి విలయాద్ విలయాద్ నిర్వి శేషం విశేన్మునిః*
*జలేజలం వియద్ వ్యోమ్ని తేజస్తేజసివా యథా ॥* 53

మునీశ్వరులైనవారు, నీటిలో నీరులాగా, ఆకాశంలో ఆకాశంలాగా, తేజస్సులో తేజస్సులాగా ఈ సాంసారికమైన భావాలన్నీ పరిసమాప్తి చెందిన పిమ్మట – ఉపాధి (శరీరం) విలయంకాగా ఆ విశ్వవ్యాపకుడైన పరమాత్మయందు ఉంటారు. – పరమాత్మలో లీనమౌతారు. ఎట్లా? నీరు నీటిలో కలసిపోయినట్టు! ఆకాశం ఆకాశంలో కలసిపోయినట్లు! తేజస్సు తేజస్సులో కలసిపోయినట్లు ! అంటే బ్రహ్మవిదుడైనవాడు బ్రహ్మమే అవుతాడు అని భావం.

*యల్లాభాన్నాపరోలాభో యత్సుఖాన్నాపరం సుఖం ।*
*యద్ జ్ఞనాన్నాపరం జ్ఞానం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥* 54

దేనిని పొందిన తరువాత ఇక పొందవలసినందంటూ ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించినట్టి సుఖం మరికొటి ఏదీ లేదో, ఏ జ్ఞానాన్ని మించినట్టి జ్ఞానం మరొకటి ఏదీ

ఉండదో అటువంటి దానినే బ్రహ్మము అంటారు. అంటే పరబ్రహ్మాన్ని మించినట్టి లాభము, సుఖము, జ్ఞానం ఏదీ లేదని భావం. ఈ భావాన్నే బృహదారణ్యకం రెండవ బ్రాహ్మణం 14వ మంత్రం కూడా చెపుతోంది.

*యద్ దృష్ట్వా నా పరం దృశ్యం యద్భూత్వాన పునర్భవః*
*యద్ జ్ఞాత్వానాపరం జ్ఞేయం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥*

దేనిని చూచిన తరువాత, ఇక చూడవలసినదంటూ ఏదీ ఉండదో, ఏదిగా అయిన తరువాత – ఏ రూపాన్ని పొందిన తరువాత ఇంకొకటిగా పుట్టవలసిన అగత్యం ఉండదో, దేనిని తెలుసుకొన్న తరువాత, ఇక తెలిసికొనదగినదంటూ ఏదీ ఉండదో అట్టి దానినే బ్రహ్మము అని గ్రహించాలి. పరమాత్మను పొందిన తరువాత ఇక చూడవలసినది ఏదీ ఉండదు. బ్రహ్మలో లీనమైన పిమ్మట ఇక జన్మ అనేది ఉండదు. బ్రహ్మజ్ఞానం కలిగిన తరువాత ఇక తెలుసుకోలసిందేదీ ఉండదని భావం.

*తిర్య గూర్ధ్వ మధః పూర్ణం సచ్చిదానందమద్వయమ్ ।*
*అన న్తం నిత్యమేకం యత్ తద్ బ్రహ్మేత్యవధారయేత్॥ 56*

పైన, క్రింద, ఎడమ ప్రక్కన, కూడి ప్రక్కన, అన్నివైపుల, అంతట వ్యాప్తమై ఉండేటటువంటి, సదా సుఖస్వరూపుడైనట్టి, అద్వితీయడైనట్టి, అనంతమైనట్టి, నిత్యము, అద్వయము అయినట్టిది ఏదో అదే బ్రహ్మము అని తెలుసుకోవాలి.

*అతద్ వ్యావృతి రూపేణ వేదాన్తైర్లక్ష్యతే ద్వయమ్ ।*
*అఖండానందమేకం యత్ తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥57*

ఉపనిషత్తులందు 'తత్త్వమసి – ఆపరబ్రహ్మవు నీవే !' మొదలైన మహావాక్యాలద్వారా, అది, నీవు, నేను అనే భేదాలు లేనట్లుగా దేనిని గురించి (ఏ పరబ్రహ్మను గూర్చి) చెప్పబడిందో, ఏది అద్వితీయము, అఖండానంద స్వరూపము అయినట్టిదో అటువంటి దానినే బ్రహ్మమని తెలుసుకో! అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, తద్బ్రహ్మ!, సర్వం ఖల్విదం బ్రహ్మ, సోం, త్వమేవాహం అటువంటివన్నీ వేదాంత శాస్త్రంలో మహావాక్యాలుగా వ్యవహరింపబడతాయి. వీటివల్ల ఏమి తెలుస్తోంది ? మనం వ్యావహారికంగా ఉపయోగించే నీవు, నేను, వాడు, అది మొదలైన వాటికి భేదం లేదని అందరూ, అంతా బ్రహ్మస్వరూప మని తెలుస్తోంది.

*అఖండానన్దరూపస్య తస్యానన్ద లవాశ్రితాః ।*
*బ్రహ్మా ద్యా స్తారతమ్యేన భవన్త్యాన న్దినో ఖిలాః ॥* 58

పూర్ణజ్ఞానానంద స్వరూపుడైన పరబ్రహ్మ యొక్క ఆనంద కణలేశమైనప్పటికి, అదే– ఆ ఆనంద బిందులేశమే బ్రహ్మ మొదలైన దేవతలకు న్యూనాధిక భావంతో ఆనందాన్ని కలిగిస్తోంది. పరమాత్మ ఆనంద స్వరూపుడు. అతని ఆనంద బిందువులే అతని నుండి లభించిన ఆనంద బిందువుల వల్లనే బ్రహ్మాది దేవతలు వారివారి అధికార తారతమ్యాల్నిబట్టి, ఆనందాన్ని పొందుతున్నారు.

*తద్యుక్త మఖిలం వస్తు వ్యవహార స్తదన్వితః।*
*తస్మాత్ సర్వగతం బ్రహ్మ క్షీరే సర్పిరివాఖిలే ॥* 59

పాలలో నెయ్యి లేక వెన్న ఉంటుంది గదా ! ఆ వెన్న పాలలో అంతటా వ్యాపించి ఉంటుందే తప్ప ఏ కొంత భాగంలోనో ఉండదు. అట్లాగే ఈ ప్రపంచంలోని సమస్త వస్తు సమూహము, సమస్తకార్యజాతము, ఆ పరమాత్మతో అనుగతమై ఉన్నాయి – పరమాత్మతో కూడి ఉన్నాయి. కాబట్టి పాలలో అంతటా నెయ్యి వ్యాపించి ఉన్నట్లే ఈ విశ్వమంతట ఆ పరబ్రహ్మ వ్యాపమై ఉన్నాడని భావము. అనణ్వ స్థూలమ హ్రస్వ మదీర్ఘ మజమవ్యయమ్ । అరూప గుణ వర్ణాఢ్యం తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥
పరబ్రహ్మము స్థూలమూకాదు, సూక్ష్మమూకాదు, పొట్టికాదు, పొడుగూ కాదు. పరమాత్మకు పుట్టుక అంటూ లేదు. కాబట్టి నాశనమూ లేదు । చావూ లేదు. ఆ పరమాత్మకు రూపము, గుణము, వర్ణము అనేవి లేవు. అటువంటి వానినే పరమాత్మగా తెలుసుకోవాలి.

*యద్భాసా భాస్యతే ర్కాదిః భాస్యైర్యత్తున భాస్యతే ।*
*యేన సర్వమిదంభాతి తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥* 61

పరమాత్మ యొక్క కాంతివల్లనే సూర్యుడు మొదలైన గ్రహ నక్షత్రాదులన్నీ ప్రకాశిస్తున్నాయి. పరమాత్మ మాత్రం ఏ ఇతర ప్రకాశం వల్లను ప్రకాశింపబడటం లేదు. ఈ విశ్వమంతా ఏ పరమాత్మ చేతనే దీప్తివంతమౌతోందో అతడే పరబ్రహ్మమని తెలుసుకోవాలి. సూర్యునివల్ల భూమి మొదలైన గ్రహాలు కాంతిని పొందుతున్నాయని, వాటికి స్వయం ప్రకాశశక్తి లేదని, అంటున్నాం గదా ! వీటిని ప్రకాశింపచేసే సూర్యుని ఇతర నక్షత్రాలను కూడా ప్రకాశింపచేసేవాడు ఆ పరమాత్మ అని భావం.

*స్వయ మన్తర్బహి ర్వ్యాప్య భాసయేన్నిఖిలం జగత్ ।*
*బ్రహ్మ ప్రకాశతే వహ్ని ప్రతప్తాయ స పిండవత్ ॥*

పరమాత్మ ఈ జగత్తు అంతట లోపల, బయట, కూడా వ్యాప్తమై ప్రకాశిస్తున్నాడు. అంటే, ఈ జగత్తు అంతా ప్రకాశంతో వెలుగొందుతున్న పరమాత్మలో, బాగా మండుతున్న అగ్నిలో తపింపబడుతున్న ఇనుపముద్దలాగా అతని తేజస్సుతో ప్రకాశిస్తోంది. అగ్నిలో కాలుతున్న ఇనపముద్ద అగ్నిలాగానే ప్రకాశించినట్లు ఈ జగత్తు పరబ్రహ్మ ప్రకాశంతో భాసిస్తోందని భావం.

*జగద్విలక్షణం బ్రహ్మ బ్రహ్మణో న్యన్య కించన ।*
*బహ్మణ్యద్భాసతే మిథ్యా యథా మరుమరీచికా ॥*

పరబ్రహ్మ ఈ జగత్తు కంటె విలక్షణమైనవాడు – భిన్నమైనవాడు. పరబ్రహ్మ తప్ప ఈ విశ్వంలో ఇతరమైనదేదీ లేదు. సర్వం ఖల్విదం బ్రహ్మ – ఈ సమస్తమూ బ్రహ్మమే! పరబ్రహ్మకంటె భిన్నంగా మనకేదైనా ఉన్నట్లు కనిపిస్తూ ఉంటే అదంతా మృగతృష్ణలాంటిదే! ఎండమావుల వంటిదే! భ్రాంతి తప్ప అది సత్యమైనది కాదు.

*దృశ్యతే శ్రూయతే యద్ యద్ బ్రహ్మణో న్యన్న విద్యతే ।*
*తత్వజ్ఞానాచ్చ తద్ బ్రహ్మ సచ్చిదానంద మద్వయమ్ ॥*

ఈ జగత్తులో మనం చూచేది, మనం వినేది సమస్తము బ్రహ్మమే ! ఈ వస్తువులన్నీ – వినబడేవీ, చూడబడేవీ బ్రహ్మము తప్ప వేరేమీ కావు. అయితే, మరి, మనం ఆ పరమాత్మను ఏ విధంగా తెలుసుకోగలుగుతాం? ఆత్మజ్ఞానంతో మాత్రమే సచ్చిదానంద స్వరూపుడైన, అద్వితీయుడైన, ఆ పరమాత్మను తెలుసుకోగలం. పరమాత్మను తెలుసకోవటానికి ఆత్మ జ్ఞానమే శరణ్యం.

*సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।*
*అజ్ఞాన చక్షుర్నేక్షేత భాస్వంతం భానుమన్ధవత్ ॥*

అంతట వ్యాపించి ఉన్నట్టి ఆ పరమాత్మను, జ్ఞానులైనవారు – జ్ఞానచక్షువులు కలవారు మాత్రమే చూడగలుగుతారు. అజ్ఞానులైనవారు. చర్మచక్షువులన్నంత మాత్రంచేత

చూడలేరు. ప్రకాశించే సూర్యుని కండ్లు ఉన్నవారు. మాత్రమే చూడగలుగుతారు. కండ్లు లేనివారు చూడలేరుగదా ! అట్లాగే అజ్ఞానులు చైతన్యస్వరూపమైన ఆత్మను – పరబ్రహ్మను చూడలేరు.

*శ్రవణాది భిరుద్దీప్తో జ్ఞానాగ్ని పరితాపిత : ।*

*జీవః సర్వ మలాన్ముక్తః స్వర్ణవద్ ద్యోతతే స్వయమ్ ॥*

అగ్నిని విసరి, ఊది బాగా ప్రజ్వలింపచేస్తారు. ఆ అగ్నిలో బంగారాన్ని బాగా తపింపచేస్తారు. అప్పుడా బంగారంలోని మాలిన్యం అంతా పోయి అది కూడా అగ్నిలాగానే ప్రకాశిస్తుంది. అట్లాగే శ్రవణ, మనన, నిది, ధ్యాసల ద్వారా జ్ఞానమనే అగ్నిని బాగా ప్రజ్వలింపచేయాలి. ఆ జ్ఞానాగ్నిలో జీవుడు బాగా తపించి తాను గూడా జ్ఞాన స్వరూపుడైన పరమాత్మలాగానే ప్రకాశిస్తాడు. జీవునికి బంగారంతోను, జ్ఞానానికి అగ్నితోను పోలిక చెప్పబడ్డది.

*హృదాకాశోదితో హ్యాత్మాబోధ భాను స్తమో పహృత్*

*సర్వవ్యాపీ సర్వధారీ భాతి సర్వం ప్రకాశతే ॥*

హృదయమనే ఆకాశంలో ఉదయించిన ఆత్మజ్ఞానం – ఆత్మబోధ అనే సూర్యుడు, మోహమనే (అజ్ఞానమనే) అంధకారాన్ని పోగొడతాడు. ఎందుచేతనంటే, ఆత్మ సర్వవ్యాపి, సమస్త విశ్వాన్ని ధరించి, స్వయం ప్రకాశమానుడై సమస్త విశ్వాన్ని తన తేజస్సుతో ప్రకాశింపచేస్తాడు– సూర్యుడు ఈ లోకాన్ని ప్రకాశింపచేసినట్లు హృదయాన్ని ఆకాశంతో పోల్చారు. సూర్యుడు స్వయంప్రకాశమానుడు. సర్వధారి, సర్వవ్యాపి – కిరణాలద్వారా – పరమాత్మలాగానే !

*దిగ్దేశ కాలాద్యనపేక్ష్య సర్వగమ్*

*శీతాది హృన్నిత్యసుఖం నిరంజనమ్ ।*

*యః స్వాత్మతీర్థం భజతే వినిష్క్రియః*

*స సర్వవిత్సర్వ గతో మృతో భవత్ ॥*

కర్తవ్యమనేది లేనివాడు, దిక్కులు, దేశకాలాలను అపేక్షించని వాడు, సర్వత్ర వ్యాపించి ఉండేవాడు, శీతోష్ణాది ద్వంద్వాలు లేనివాడు, నిత్యసుఖప్రదాత, కల్మష (పాప)

రహితుడు అయిన తన ఆత్మ అనే తీర్థాన్ని (పుణ్యక్షేత్రాన్ని) ఆరాధించేవాడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, జీవన్ముక్తుడు అవుతాడు. ఆత్మ అనే తీర్థాన్ని భజించేవాడు పరమాత్మ స్వరూపుడే అవుతాడు. తాను భజించే ఆత్మకు, తాను పొందే పరమాత్మకు ఉన్న లక్షణాలన్నీ ఒకటే కాబట్టి తానే పరమాత్మ స్వరూపుడౌతాడు. ఇది ఫలశ్రుతి.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ మచ్ఛంకరాచార్య విరచిత
ఆత్మబోధ ప్రకరణం సంపూర్ణం
ఓం తత్సత్

–oOo–

**శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారి గ్రంథములు**

1. ఉపనిషద్దర్శనము భాగం 1
   (తైత్తిరీయ, ఈశ, కేన, ప్రశ్న, మాండూక్య, కఠోపనిషత్తులు)
2. ఉపనిషద్దర్శనము భాగం 2 (బృహదారణ్యకోపనిషత్తు)
3. ఉపనిషద్దర్శనము భాగం 3(ఛాందోగ్య, ఐతరేయ, ముండకోపనిషత్తులు)
4. ఉపనిషద్దర్శనము భాగం 4
   (శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులు)
5. బ్రహ్మసూత్ర దర్శనము (శారీరక మీమాంస)
6. గీతా దర్శనము 9భగవద్గీత)
7. ఆత్మబోధ
8. ఆత్మానాత్మ వివేకము
9. అపరోక్షానుభూతి
10. వివేక చూడామణి
11. పతంజలి యోగదర్శనము
12. ధ్యానయోగము
13. వేదాంత పంచదశి (మాధవ విద్యారణ్య మునీంద్రకృతము)
14. యోగ వాసిష్టసారము
15. పరలోకము – పునర్జన్మ
16. మన వివాహ వ్యవస్థ

పై గ్రంథములన్నియు క్రింది వెబ్‌సైట్ నుంచి ఉచితంగా డైన్‌లోడ్ చేసుకోవచ్చును.

website : www.sriramakrishnatapovanam.org

Email : chvenkateswarlu30@gmail.com